Photo by Brahmdev



బహుమతి
పొందిన వ్యాఖ్య

పదండి ముందుకు

పంపినవారు:
యు. ఎస్. మూర్తి - షక్కర్‌నగర్

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ,
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


చందమామ (అన్ని భాషలలో)
విడి కాపీ **50** నయా పైసాలు. (**8** అణాలు)
సాలు చందా రు **6** లు.

నవంబరు **చందమామ**

## అత్యంత ఆకర్షణీయమైన
# దీపావళి సంచిక!



సుమారు 100 పేజీలకు పైగా - అదనపు కథలతో - వ్యంగ్య, వర్ణ చిత్రాలతో - ముచ్చట గొలిపే ముఖచిత్రంతో - మరి ఎన్నో విశేషాలతో వెలువడుతున్నది. తెలుగు - అరవం - కన్నడం - హిందీ - మహారాష్ట్రి - గుజరాతీ - భాషలలోమాత్రమే.

## ఏ భాష సంచికైనా వెల **12** అణాలు



మీ ఏజంటుతో ముందుగానే కాపీ వుంచమని చెప్పడం మంచిది.



వివరాలకు:

# చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మదరాసు - 26




జె. బి. మంఘారామ్ వారి




ఎనర్జీ
ఫుడ్
బిస్కత్తులు

రేపటి పౌరులకు పుష్టి నిచ్చునవి



**J. B. MANGHARAM & CO.**
GWALIOR.

JBM

® JB/41

---

# జె. బి. మంఘారామ్ అండ్ కో.,
## గ్వాలియర్.

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో మీరు "యతి" అనే మృగమానవుణ్ణి గురించి చదువుతారు. ఈ మృగాలు మానవు లనిపించు కోకపోవచ్చుగాని మానవులకు అత్యంత సన్నిహితమైన మృగాలనటానికి సందేహం లేదు. ఈ జంతువులు ఉంటున్నది హిమాలయాలలో అయినప్పటికీ ప్రస్తుతం వీటినిగురించి అన్వేషణలు చేస్తున్నవారంతా పాశ్చాత్యులూ, పైదేశాలవాళ్ళూనూ.

అనేక శతాబ్దాల రాజకీయ బానిసత్వంమూలంగా మనం జ్ఞానతృష్ణను కోల్పోయినాము. మన నాగరికత యావత్తూ ఇతర దేశాలనుంచి దిగుమతి అవుతున్నది. మన పరిసరాలను గురించికూడా మనకు ఇతరులు చెప్పవలసిన దుస్థితి ఎప్పటికైనా తొలగిపోవాలి.

"చందమామ" నవంబరు సంచిక అనేక ప్రత్యేకాకర్షణలతో, ఎక్కువ పేజీలతో దీపావళి ప్రత్యేక సంచికగా వెలువడుతుంది.

సంపుటి 25 : అక్టోబర్ 1959 : సంచిక 4





CHITRA




అవతల కౌరవసేనలో కొందరు ధర్మరాజు రావటం చూసి హాహాకారాలు చేశారు, కొందరు మౌనంగా ఉన్నారు. మరికొందరు, "చూశావా? ధర్మరాజు బెదిరిపోయి తన ప్రాణాలూ, తన తమ్ముల ప్రాణాలూ కాపాడమని భీష్ముణ్ణి వేడుకోవటానికి వస్తున్నాడు. అటువంటి తమ్ములను పెట్టుకుని ఇంత భయపడేవాడు ఇతను ఏం క్షత్రియుడు? తీరా యుద్ధం చేయవలిసి వచ్చేసరికి కాళ్లు చల్లబడ్డాయి!" అనుకున్నారు.

వారిలో కొందరు పైకి "ఛీ, ఛీ!" అనికూడా అన్నారు.

ఈలోపుగా ధర్మరాజు తన తమ్ములతో కూడా కౌరవసైన్యం ప్రవేశించి భీష్ముణ్ణి చేరుకుని, ఆయన పాదాలపై పడి, "తాతా, ఎవరూ గెలవలేని నీతో మాకు యుద్ధం సంప్రాప్తమయింది. అందుకు అనుమతించి, మమ్మల్ని దీవించు!" అన్నాడు.

ఆ మాటలు విని భీష్ముడు, "నాయనా, నీవు వచ్చి ఇలా నన్ను కోరటం చూసి నేనెంతో సంతోషిస్తున్నాను. నేను కౌరవుల ఉప్పు తిన్నవాణ్ణికనక వారి పక్షాన యుద్ధం చెయ్యక తప్పదు. నీవు యుద్ధం చెయ్యి, జయం పొందుతావు. నావల్ల ఏ వరమైనా కావలిస్తే కోరుకో!" అన్నాడు.

"తాతా, ఎప్పుడూ నా మేలు కోరుతూ, నాకు తగిన సలహా ఇస్తూవుండు. నీవు యుద్ధంచెయ్యటం నాకేమాత్రమూ అభ్యంతరం లేదు," అన్నాడు ధర్మరాజు.

"నాయనా, ఏ విషయమై నా సలహా కావాలి?" అని భీష్ముడడిగాడు.

"తాతా, నీవు ఎవరికీ ఓడవుగదా? నిన్ను ఓడించటానికి మేము ఏం చేయాలి?" అని ధర్మరాజు అడిగాడు.

"ధర్మరాజా, నన్ను యుద్ధంలో చంపగలవాడెవడో నాకు తెలియటంలేదు. మళ్లీ

ఇంకొకసారి కలుసుకుందాంలే!" అన్నాడు భీష్ముడు.

ధర్మరాజు భీష్ముడికి నమస్కారం చేసి ఆయనవద్ద సెలవు తీసుకుని, తమ్ములతో సహా ద్రోణుడివద్దకు వెళ్లి ఆయనకు నమస్కరించి, "ఆచార్యా, గురువైన నీ అనుమతి లేకుండా యుద్ధం ప్రారంభించటం దోషమవుతుంది. కనుక నాకు అనుమతి ఇయ్యి!" అని కోరాడు.

ద్రోణుడుకూడా భీష్ముడిలాగే ధర్మరాజును యుద్ధంచెయ్యమనీ, విజయం పొందమనీ ఆశీర్వదించి, "యుద్ధసహాయం తప్ప ఇంకేది కోరినా చేస్తాను," అన్నాడు. ధర్మరాజు విజయమయేలాగు ఆశీర్వదించమని కోరాడు. ద్రోణుడు అలాగే ఆశీర్వదించాడు. తరవాత ధర్మరాజు ద్రోణుడితో, "మిమ్మల్ని ఓడించే ఉపాయం ఏదైనా ఉంటే చెప్పండి!" అన్నాడు.

"నేను అస్త్రశస్త్రాలు ధరించి ఉండగా నన్నెవడూ ఓడించలేడు. నన్ను చంపాలంటే వాటిని నేను విసర్జించినప్పుడే చంపాలి. యుద్ధం చేసే సమయంలో నాకు దుర్వార్త ఏదైనా తెలిస్తే నేను వెంటనే అస్త్రశస్త్రాలను విడిచిపెడతాను. అంతేగాని మరొక పరిస్థితిలో నేను యుద్ధం మానను," అన్నాడు ద్రోణుడు.







తరవాత ధర్మరాజు కృపుడివద్దకూ, శల్యుడివద్దకూ వెళ్ళి వారికి నమస్కారాలు చేసి యుద్ధంచెయ్యటానికి వారి అనుమతీ, యుద్ధంలో విజయం కలిగేటట్టు వారి ఆశీస్సులూ పొందాడు. తన మేనమామ అయిన శల్యుడితో ఆయన, "మామా, కర్ణుణ్ణి చంపటానికి మాకు నీ సహాయం అవసరమవుతుంది," అన్నాడు. అలాగే సహాయం చేస్తానన్నాడు శల్యుడు.

ఈలోపుగా కృష్ణుడు కర్ణుడున్న చోటికి వెళ్ళి, "కర్ణా, భీష్ముడు జీవించివుండగా యుద్ధం చెయ్యనని ప్రతిజ్ఞచేసినట్టు విన్నాను. అంతదాకా పాండవుల పక్షాన యుద్ధంచేయరాదా? ఆ తరవాత కౌరవులపక్షానికి మారవచ్చు!" అన్నాడు.

ఈ మాట విని కర్ణుడు కృష్ణుడితో, "కృష్ణా, నేను దుర్యోధనుడికోసం ప్రాణాలు అర్పించటానికి సిద్ధంగా ఉన్నవాణ్ణి, నీవు చెప్పినట్టు చేసి అతనికి అపకారం చేస్తాననుకున్నావా?" అన్నాడు.

నమస్కారాలు చేయవలసినవారందరికీ చేసి, తన సైన్యానికి తిరిగివస్తున్న ధర్మరాజు రెండు సైన్యాలమధ్యా ఆగి, కౌరవపక్షాన గల యోధులతో, "ఓ సైనికులారా, మీలో ఎవరుగాని మా పక్షాన యుద్ధంచెయ్యటానికి ఇష్టపడినట్టయితే వారిని రావలిసిందిగా మేము కోరుతున్నాం!" అని అన్నాడు.

కౌరవసైన్యంలో ఉన్న యుయుత్సుడు ధర్మరాజుతో, "రాజా, నీవు కోరేపక్షంలో నేను నీవైపు చేరి కౌరవులతో యుద్ధం చేస్తాను!" అన్నాడు. ఈ యుయుత్సుడు కూడా ధృతరాష్ట్రుడి కొడుకులలో ఒకడు. ఇతని తల్లి ఒక వైశ్యస్త్రీ.

ధర్మరాజు ఆదరంతో, "యుయుత్సుడా, రా, రా! మూఢులైన నీ అన్నలతో మన మంతా కలిసి పోరాడదాం! దుర్యోధనాదులకు తండ్రికి పిండాలు పెట్టే యోగ్యత లేదు, నీవైనా ఆపని చేద్దువుగాని!" అన్నాడు.





వెంటనే యుయుత్సుడు పాండవుల సేనకు మారాడు. ధర్మరాజు తన రథం వద్దకు వెళ్లి కవచం ధరించాడు. పాండవు లంతా యుద్ధసన్నద్ధులై తమ తమ రథా లలో ఉన్నదీ లేనిదీ సర్వసేనాని ధృష్ట ద్యుమ్నుడు ఒకసారి చూసుకున్నాడు. తర వాత రెండు పక్షాలవారూ శంఖాలూ, భేరులూ మోగించారు.

యుద్ధం ఆరంభమయింది. మహాభయం కరమైన భారతయుద్ధంలో మొదటి సంఘర్షణా, తుది సంఘర్షణాకూడా భీముడే నిర్వహించాడు. పాండవసేనకు ముందు నిలబడివున్న భీముడు దిక్కులు బద్దలయే లాగ ఒక పెడబొబ్బ పెట్టి, యముడులాగా కౌరవులపైకి ఉరికాడు. దుర్యోధన దుశ్శాస నాదులు అతనికి ఎదురువెళ్లారు. పాండవుల వైపునుంచి ఉపపాండవులూ, అభి మన్యుడూ, నకుల సహదేవులూ, ధృష్ట ద్యుమ్నుడూ మొదలైనవారు దుశ్శాసనాదు లను ప్రతిఘటించి తమ విలువిద్య ప్రద ర్శించసాగారు. వెంటనే ఉభయ పక్షాల గల యోధులు ఒకరితో ఒకరు పోరాటం ప్రారంభించారు.

ఒకవైపునుంచి భీష్ముడూ, రెండోవైపు నుంచి అర్జునుడూ శత్రుసేనలను కార్చిచ్చు




లాగా నిర్మూలించుకుంటూ వచ్చి ఒకరి కొకరు తారసిల్లారు. వారిద్దరిమధ్యా భీకర మైన ద్వంద్వయుద్ధం సాగింది.

ఇదే విధంగా సైన్యమంతటా ద్వంద్వ యుద్ధాలు సాగాయి. కృతవర్మతో సాత్యకీ, కోసలరాజైన బృహద్బలుడితో అభి మన్యుడూ, దుర్యోధనుడితో భీముడూ, దుశ్శాసనుడితో నకులుడూ, దుర్ముఖుడితో సహదేవుడూ, శల్యుడితో ధర్మరాజూ, ద్రోణు డితో ధృష్టద్యుమ్నుడూ, అలంబసుడితో ఘటోత్కచుడూ, అశ్వత్థామతో శిఖండీ, సైంధవుడితో ద్రుపదుడూ, వికర్ణుడితో భీముడి కొడుకు శ్రుతసోముడూ, శకునితో





ధర్మరాజు కొడుకు ప్రతివింధ్యుడూ—ఈ విధంగా అనేక జంటలుగా ఉభయ పక్షాల యోధులు ద్వంద్వయుద్ధాలు చేసుకున్నారు. ఈ యుద్ధాలలో యోధులెవరూ చావలేదు గాని ఎన్నో ధ్వజాలు విరిగాయి, రథాలు కూలాయి, గుర్రాలు చచ్చాయి, సారథులు చచ్చారు, ఎంతోమంది యోధులు గాయపడ్డారు. ఈ ద్వంద్వయుద్ధాల వెంబడే దొమ్మియుద్ధంకూడా సాగింది. దొమ్మి యుద్ధంలో సైనికులూ, గుర్రాలూ, ఏనుగులూ అపారంగా చావటం జరిగింది.

మిట్టమధ్యాన్నం కావస్తున్నదనగా భీష్ముడు మృత్యుదేవతలాగా పాండవసైన్యంలోకి జొరబడ్డాడు. ఆయనను రక్షించటానికి గాను దుర్యోధనుడు దుర్ముఖుణ్ణీ, కృతవర్మనూ, కృపుణ్ణీ, శల్యుణ్ణీ మరికొందరినీ నియోగించాడు. తమ సేనను చీల్చిచెండాడ వస్తున్న భీష్ముణ్ణి చూసి అభిమన్యుడు మండిపడి ఆయనకు ఎదురువెళ్లాడు. అతని రథంపైన కొండగోగు గుర్తు గల జెండా ఎగురుతున్నది.

అభిమన్యుడు భీష్ముణ్ణి ఎదుర్కొంటూనే ఆయనపైనా ఆయనకు సహాయంగా ఉన్న వారిపైనా శరపరంపర ప్రయోగించాడు; భీష్ముడి శరీరంలో తొమ్మిది బాణాలు గుచ్చుకున్నాయి; కృపుడి చేతి విల్లు విరిగి



పడింది; దుర్యోధనుడి జెండా ఒక్క దెబ్బతో విరిగింది, ఇంకొక దెబ్బకు అతని సారథి తల పడిపోయింది! అభిమన్యుడి యుద్ధం చూసేవారికి అర్జునుడు జ్ఞాపకం వచ్చాడు. భీష్ముడు అభిమన్యుణ్ణి వెనక్కు మరల్చటానికి ఎంతో ప్రయత్నించాడు గాని అభిమన్యుడు తనపైకి వచ్చే బాణాలన్నిటినీ ఖండిస్తూ, చివరకు భీష్ముడి తాటిచెట్టు జెండానే పడగొట్టేశాడు.

ఇదిచూసి భీముడు పరమానందంతో సింహనాదం చేశాడు.

ఇంతలో విరాటుడూ, ఆయన కొడుకులూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ మొదలైనవారు అక్కడికి వచ్చి కౌరవయోధులతో తలపడ్డారు. ఈ తలపడటంలో ఉత్తరుడు శల్యుడిపైకి వెళ్లాడు. అతను అప్పుడొక ఏనుగునెక్కి ఉన్నాడు. ఆ ఏనుగు శల్యుడి రథంపైకి లంఘించి, ఆ రథానికి కట్టి ఉన్న గుర్రాలు నాలుగింటినీ చంపేసింది. శల్యుడు రథం దిగకుండానే అతి దారుణమైన శక్తిని ఉత్తరుడిపైన విసిరాడు. శక్తి ఉత్తరుడి కవచాన్ని ఛేదించి అతన్ని మూర్ఛ పోగొట్టింది. ఉత్తరుడి చేతినుంచి అంకుశం జారిపోయింది. అతను ఏనుగుపైనుంచి నేలపై పడిపోయాడు. ఈలోపుగా శల్యుడు కృతవర్మ రథంలోకి ఎక్కాడు.





తన సోదరుడు శల్యుడిచేత దెబ్బతినటం గమనించి విరాటుడి మరొక కుమారుడైన శ్వేతుడు కోపావేశంతో కౌరవయోధు లేడు గురిపైకి ఒంటరిగా వచ్చాడు. అతను శత్రువులతో అతి భయంకరమైన యుద్ధం చేశాడు; ఏడుగురి విల్లులూ విరగగొట్టాడు; వారందరూ తనపై విసిరిన ఏడు శక్తులను తన బాణాలతో పడగొట్టాడు; శకుని కొడుకైన రుక్మరథుణ్ణి ఒక్క బాణంతో మూర్ఛపోగొట్టి, శల్యుడి రథంపైకి సింహంలాగా వచ్చిపడ్డాడు. ఆ రోజు శల్యుడు శ్వేతుడి చేతిలో చావవలిసినవాడే, సమయానికి దుర్యోధనుడు భీష్ముడు మొదలైన వీరులతో వచ్చి శ్వేతుడికి అడ్డుపడ్డాడు; శల్యుడు ప్రాణాలు దక్కించుకుని అక్కడినుంచి వెనక్కు వెళ్లిపోయాడు.

అంతతో శాంతించటానికి బదులు శ్వేతుడు రెచ్చిపోయి, ఉన్మాదుడులాగా పోరాడుతూ, కౌరవయోధులను వందల సంఖ్యలోనూ, వేల సంఖ్యలోనూ బలి తీసుకోసాగాడు. అతని దెబ్బకు తట్టుకోలేక పారిపోయిన కౌరవయోధులు, "వీరాగ్రేసరా, ఆ శ్వేతుణ్ణి ఎదుర్కొవటానికి మాకు సాహసం చాలకుండా ఉన్నది!" అని భీష్ముడితో మొరపెట్టుకున్నారు.

ఈ మాటలు విన్న భీష్ముడు విజృంభించి, శ్వేతుడికేసి బయలుదేరి, అడ్డం వచ్చిన పాండవసేనలను మారణం చేయసాగాడు.

చివరకు భీష్ముడూ శ్వేతుడూ తలపడ్డారు. వారిద్దరికీ ఘోరమైన యుద్ధం జరిగింది. ఆ క్షణంలో శ్వేతుడు ఎదురు తగలటంవల్ల పాండవసేనలో ఎంత భాగం భీష్ముడికి బలికాకుండా దక్కిందో ఊహించటం కష్టం. ఇద్దరూ ఒకరినొకరు బాణాలతో తూట్లుతూట్లుగా కొట్టుకున్నారు. చివరకు భీష్ముడు అలిసిపోయి యుద్ధం విరమించి వెనక్కు తిరిగాడు. పాండవుల ఆనందానికీ, కౌరవుల విచారానికీ మేరలేదు.






## 16

[కంచుకోటకు వెళ్లేందుకు రుద్రపురం రాజైన శివసింహుడు చంద్రవర్మకు సహాయపడ్డాడు. చంద్రవర్మ నలుగురు రాజోద్యోగులనూ, కొందరు సైనికులనూ వెంటబెట్టుకుని పడమటిదిక్కుగా బయలుదేరాడు. మార్గంలో వారికి ఒక శిథిలనగరం కనబడింది. అక్కడ వున్న శాసనంద్వారా అది కరవీరపురం అని చంద్రవర్మ తెలుసుకున్నాడు. తరవాత—]

కరవీరపురం శిథిలాలను దాటి పడమటి దిక్కుగా కొంత దూరం ప్రయాణించిన తరవాత హఠాత్తుగా, చంద్రవర్మ మార్గాన ఎత్తయిన పర్వతాలు కనిపించినై. ఆ పర్వతాలను దాటి అవతలి వైపుకు చేరటం కఠిన సమస్యగా పరిణమించింది. పర్వత ప్రాంతమంతా ఎగుడుదిగుడు రాళ్ల మయం. ఆహార పదార్థాలను మోసుకువస్తున్న కంచరగాడిదలు కాలూని పర్వత పైభాగాన్ని చేరేందుకు ఏమాత్రం అవకాశం లేదు.

"ఎవరు మోయగలిగినన్ని ఆహార ధాన్యాలు వాళ్లు భుజాన వేసుకుని పర్వతం ఎక్కటం ఒకటే మన కున్న మార్గాంతరం. కంచరగాడిదలను ఈ అడవిలో వదలవలసిందే," అన్నాడు చంద్రవర్మ.

దీనికి మొదట్లో శివసింహుడు పంపిన నలుగురు రాజోద్యోగులూ అభ్యంతరం చెప్పారు. "కొండ అవతల ఏమున్నదో మనకు తెలియదు. బహుశా అక్కడ ఆహార పదార్థాలు లభ్యం కాకపోవచ్చు. అలాం






టప్పుడు కంచరగాడిదలమీద వున్న ఆహార ధాన్యాల్లో ఎక్కువ భాగం అడవిలో వదిలి పెట్టి, మనిషి మోయగలిగినన్ని మాత్రమే తీసుకుని, కొండ అవతలికి వెళ్లటం ప్రమాద కరం," అన్నారు వాళ్లు.

"ఈ కొండ ఎక్కేందుకు ఎక్కడా కాలిబాటకూడా వున్నట్టు లేదు. మనమే తాళ్లు పట్టుకుని వాటి ఆసరాతో కొండ ఎక్క వలసి వుంటుంది. అలాంటప్పుడు కంచర గాడిదలనుకూడా మనం కొండపైకి తాళ్లతో ఎలా లాగగలం? కనుక కొంత ఆహార ధాన్యాన్నీ, కంచరగాడిదలనూ ఈ అడవి పాలు చేయవలసిందే, తప్పదు!" అన్నాడు చంద్రవర్మ. ఈ చెప్పినదానికి ఆ నలుగురు రాజోద్యోగులూ తప్ప తతిమ్మా వాళ్లు ఆమోదం తెలిపారు. ఆ వెంటనే గాడిదల మీదనుంచి బరువులు దించి, వాటిలో ఎవరు మోయగలిగినన్ని వాళ్లు మూటలు కట్టుకుని, వాటిని తలమీదా, భుజాలమీదా ఎత్తుకుని అందరూ కొండ ఎక్కటం ప్రారంభించారు.

ఈ కొండ ఎక్కే ప్రయత్నం సూర్యోదయం వేళ ప్రారంభమయింది. సరిగా మిట్టమధ్యాన్నం వేళకు వాళ్లు కొండమీద ఒకానొక చదునుప్రదేశాన్ని చేరారు. అక్కడ అన్నాలు వండుకు తిని, కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్న తరవాత, తిరిగి కొండ ఎక్కే పని ప్రారంభమయింది. సాయంకాలమై, సూర్యాస్తమయం ఒకటి రెండు ఘడియల్లో అవుతుందనగా వాళ్లు కొండ శిఖరాన్ని చేరారు.

అందరికన్న ముందుగా శిఖరాన్ని చేరిన చంద్రవర్మా, దేవలుడూ తమ కంట బడిన అద్భుతదృశ్యం చూసి మహదానందం పొందారు. కొండకు దిగువగా వారికి ఒక మహానగరం కనిపించింది. ఆ నగరంలోని ఎత్తయిన భవనాలమీద సూర్యకాంతి పడి కళ్లకు మిరుమిట్లు కొలుపుతున్నది. నగరా





నికీ, కొండకూ మధ్యనున్న ప్రదేశంలో పండ్ల తోటలూ, పంటపొలాలూ సమృద్ధిగా వున్నవి.

ఈ నగరం ఎవరిది? దీని పేరేమిటి? అని చంద్రవర్మ ఆశ్చర్యపడుతున్నంతలో రాజోద్యోగుల్లో ఒకడు వారిని సమీపించి, దిగువనున్న నగరంకేసి చూసి, సంతోషంతో ఉక్కిరిబిక్కిరైపోతూ, "శివపురం, శివపురం" అని కేకలుపెట్టాడు.

"ఇది శివపురం అని నీకెలా తెలుసు? ఈ పట్టణానికి లోగడ ఎప్పుడైనా వెళ్లావా?" అని చంద్రవర్మ అతణ్ణి అడిగాడు.

"అయ్యా, ఈ శివపురంలో కొంతకాలం కిందట ఓ నెలరోజులపాటు వున్నాను. ఇది రుద్రపుర రాజ్యానికి పడమటి సరిహద్దు మీద వున్న పట్టణం. ఆ తరవాత అంతా పెద్ద ఎడారి. ఈ శివపుర నగరానికి రాజ ప్రతినిధిగా వుంటున్న వీరమల్లుడు అనబడే ఆయనకూడా నాకు తెలుసు," అన్నాడు రాజోద్యోగి.

"అయితే, నీకు రుద్రపురాన్నుంచి, ఈ పట్టణానికి వెళ్లే మార్గం బాగా తెలుసునన్న మాట! ఆ మాట నాతో ఎన్నడూ అనలేదే!" అన్నాడు చంద్రవర్మ అనుమానంగా.

ఆ ప్రశ్న వింటూనే రాజోద్యోగి కొంచెం బెదురుకుని, "అయ్యా, నేను క్రితంలో ఈ



పట్టణానికి వచ్చిన మార్గం యిది కాదు. రాజధానీనగరం రుద్రపురంనుంచి, ఈ శివపురానికి మరేదో మార్గంకూడా ఒకటి వున్నది. అది ఇప్పుడు నాకు బాగా గుర్తు లేదు," అన్నాడు.

చంద్రవర్మ, రాజోద్యోగితో యిలా మాట్లాడుతున్నంతలో కొండకిందినుంచి భేరీ మోగిన ధ్వని వినబడింది. ఆవెంటనే దానికి ప్రత్యుత్తరంగా పట్టణప్రాకారంలోని ఒక బురుజుమీదినుంచి భీకరమైన ఢంకా నినాదం మార్మోగింది. ఆ క్షణంలోనే విల్లంబులూ, ఈటెలూ ధరించిన కొందరు సైనికులు బురుజుమీదికి వచ్చారు.





తమను శత్రువులుగా భావించి నగర రక్షకులు ఈ సంకేతాలతో హెచ్చరికలు చేసుకుంటున్నారని చంద్రవర్మ గ్రహించాడు. బురుజుమీద వున్న సైనికులు తమ మీద బాణాలు ప్రయోగించకముందే తాము మిత్రులమని వాళ్లకు తెలియచెప్పటం అవసరం అని అతడికి తోచింది. వెంటనే చంద్రవర్మ ఒక తెల్లగుడ్డను తన కత్తిమొనతో పైకెత్తి గాలిలో వూపాడు.

బురుజుమీదికి వచ్చిన సైనికులు ఒక క్షణకాలం కొండశిఖరానికేసి చూస్తూ నిలబడిపోయారు. అంతలో అజానుబాహుడైన ఒక వ్యక్తి సైనికులను తొలగతోసుకుంటూ ముందుకు వచ్చి, విల్లు ఎక్కుపెట్టి, చంద్రవర్మకేసి బాణం వదిలాడు. రివ్వుమనే శబ్దంతో బాణం వచ్చి చంద్రవర్మకు కొద్ది దూరాన భూమిలో గుచ్చుకుపోయింది. దానికి ఒక కాయితం కట్టబడి వున్నది.

చంద్రవర్మ ఆత్రంగా బాణం అందుకుని, దానికి కట్టివున్న కాయితాన్ని విప్పి చదివాడు. శివపురం కోటబురుజుల రక్షకదళ నాయకుడు, తమ పేరూ, ఊరూ, ఆ ప్రాంతాలకు ఏం పనిమీద వచ్చిందీ తెలపవలసిందిగా అడుగుతున్నాడు. వెంటనే జవాబు రాకపోతే, శత్రువులుగా భావించి సర్వనాశనం చేయగలనని హెచ్చరించాడు.





చంద్రవర్మ, రుద్రపురం రాజు శివ సింహుడు తనకు యిచ్చిన అజ్ఞాపత్రాన్ని బాణానికి కట్టి, దానిని కోటబురుజుమీద పడేలా వదిలాడు. కొద్దిసేపటికల్లా బురుజు మీద కోలాహలం బయలుదేరింది. చంద్ర వర్మనూ, అతడి అనుచరులనూ ఆహ్వా నిస్తున్న సూచనగా సైనికులు జయజయ ధ్వానాలు చేశారు.

కొండమీదినుంచి నగరంవైపుకు వున్న రాతిమెట్లమీదుగా చంద్రవర్మా, అతడివెంట వున్నవారూ నడిచి, కొద్దిసేపటికల్లా, కోట చుట్టూ వున్న అగడ్తను చేరారు. ఆసరికి అక్కడికి కొందరు సైనికులు వచ్చి గుమి గూడారు. చంద్రవర్మ వారిని చూస్తూనే, ఆశ్చర్యానందాలతో ఉక్కిరిబిక్కిరై పోయాడు. అందుకు కారణం: సైనికులకు ముందుగా సేనానాయకుడి దుస్తుల్లో సుబా హుడు అతడికంట బడటం.

సుబాహుడుకూడా తమ యువరాజైన చంద్రవర్మను తృటిలో గుర్తించ గలిగాడు. ఆ వెంటనే అతడు చంద్రవర్మకు హెచ్చ రికగా చేయి వూపాడు. దాని భావం; తాము ఒకరినొకరు గుర్తించినట్టు యితరులకు తెలియనివ్వకూడదని. చంద్రవర్మ ఆ సూచ నను గ్రహించి, చకచకా ముందుకు నడిచి, సుబాహుణ్ణి సమీపిస్తూ, సగౌరవంగా అతడికి







భక్తిగా చంద్రవర్మకు నమస్కరించి, "మహారాజా! నేను చాలా అదృష్టవంతుణ్ణి. ఈ జన్మలో తిరిగి మీ దర్శనభాగ్యం లభిస్తుందని అనుకోలేదు. ఇంటికి వెళ్లి అన్ని సంగతులూ మాట్లాడుకుందాం, రండి," అంటూ కోటలోకి దారితీశాడు.

చంద్రవర్మ సుబాహుడి ఇంటికి వెళ్లిన కొద్దిసేపటికల్లా, అతణ్ణిగురించి సర్వం తెలుసుకున్నాడు. ఆనాడు సర్పకేతుడి సైనికుల బారి పడకుండా తప్పించుకునేందుకు చంద్రవర్మతోపాటు నదిలోకి దూకిన తరవాత, సుబాహుడు ఒకానొక కొండలోయలో ఒడ్డుకు చేరి, కొన్నాళ్లతరవాత ధీరమల్లుణ్ణి ఆ కొండల్లోనే కలుసుకున్నాడు. సర్పకేతుడితో జరిగిన ఆఖరి పోరాటంలో ధీరమల్లుడు పూర్తిగా ఓడిపోయి, మిగిలిన కొద్దిమంది అనుచరులతో కొండల్లో, అడవుల్లో తల దాచుకోవలసి వచ్చింది. కొన్నాళ్లకు అందరూ కలిసి రుద్రపురం రాజైన శివసింహుడి కొలువులో చేరి, ఆయన పంపగా శివపురానికి వచ్చారు. శివసింహుడి కొలువులో చేరేప్పుడే ధీరమల్లుడు, తన పేరు వీరమల్లుడని చెప్పుకున్నాడు. ప్రమాదవశాన తన ఉనికి సర్పకేతుడికి తెలియకుండా వుండగలందులకే అతడీ పని చేశాడు.

నమస్కరించి, "మీరు శివపుర సేనానాయకులా? నేను రాజప్రతినిధి వీరమల్లుగారిని కలుసుకోవలసి వుంది. వారితో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి," అన్నాడు.

"అదెంత పని. ముందుగా మీకూ మీ అనుచరులకూ విడిదీ, భోజన సదుపాయాలూ ఏర్పాటు చేయనివ్వండి. విశ్రాంతి తీసుకున్న తరవాత మీరు రాజప్రతినిధిని చూడవచ్చు," అంటూ సుబాహుడు తన వెంటవున్న సైనికులకు చంద్రవర్మ పరివారాన్ని ఒప్పగించాడు.

సైనికులూ, చంద్రవర్మ అనుచరులూ కోటలోకి వెళ్లిపోగానే, సుబాహుడు ఎంతో








చంద్రవర్మ కూడా సుబాహుడితోపాటు తను నదిలో దూకిన తరవాత, జరిగిన సంఘటనలన్నీ అతడికి వివరంగా చెప్పాడు. అంతా చెప్పినతరవాత చంద్రవర్మ తను ప్రస్తుతం బయలుదేరిన పనినిగురించి చెపుతూ, కంచుకోట పేరు తేగానే, సుబాహుడు నివ్వెరపోయాడు.

"మహారాజా! మనకు కష్టకాలం పోయి, అదృష్టకాలం సమీపిస్తున్నది. అసలు సంగతి సేనాని ధీరమల్లుడు పట్టణంలో లేడు. ఈ సంగతి మరెవరికీ తెలియకుండా రహస్యంగా వుంచాము. సర్పకేతుడు సైన్యాన్ని వెంటబెట్టుకుని కంచుకోట ప్రాంతానికి వెళుతున్నట్టు మాకు తెలిసింది. అతడి బలాబలాలేమిటో తెలుసుకుని, సాధ్యమైతే అతణ్ణి మార్గమధ్యంలో నాశనం చేసేందుకు సేనాని ధీరమల్లుడు రహస్యంగా కొంత సైన్యాన్ని వెంటపెట్టుకుని రెండు రోజులక్రితం నగరాన్నుంచి బయలుదేరిపోయాడు," అన్నాడు సుబాహుడు.

సర్పకేతుడి పేరు వింటూనే చంద్రవర్మ ఉద్రేకంతో వూగిపోయాడు. అది గ్రహించిన సుబాహుడు, "మహారాజా! ఈనాడు సర్పకేతుడు మన వీరపురానికే గాక, మొత్తం మాహిష్మతీరాజ్యానికే చక్రవర్తి. యశోవర్ధన చక్రవర్తి మరణించాడు. ఆయన పెద్ద కుమారుడు తపోవర్ధనుడు విరాగియై అడవులు పట్టి పోయాడు. తను సహాయం చేస్తానని నమ్మించి, గుణవర్ధనుడితో తన అవసరం తీరిపోగానే, సర్పకేతుడు అతణ్ణి చంపి, మాహిష్మతీ రాజ్యానికి పట్టాభిషేకం చేసుకున్నాడు," అన్నాడు.

"ఇంత రాజ్యం వుండీ ఆ దుష్టుడికి యింకా ధనదాహం తీరలేదన్న మాట. కంచుకోటలో వున్న సంపదలకోసం బయలుదేరాడు!" అన్నాడు చంద్రవర్మ కటువుగా.

"సర్పకేతుడి ఈ జైత్రయాత్రకు ఒక్క ధనదాహమే కాక, రాజ్యకాంక్ష కూడా





కారణం అయివుంటుంది. ఏది ఏమైనా వాడు హఠాత్తుగా ఈ శివపురంమీద దాడి చేయకపోవటం అదృష్టం అనుకోవాలి. చారులద్వారా మాకే ముందుగా, వాడే మార్గాన పోతున్నదీ తెలిసింది," అన్నాడు సుబాహుడు.

సుబాహుడు యిలా మాట్లాడుతున్నంతలో దూత ఒకడు వచ్చి అతడి చేతికి ఒక పత్రం యిచ్చాడు. సుబాహుడు దాన్ని విప్పి చదువుతూనే వెలవెలపోయి, పూర్తిగా చదివింతరవాత పత్రాన్ని చంద్రవర్మ చేతికి అందించాడు.

చంద్రవర్మ ఆ పత్రాన్ని చదివాడు. అది సేనాని ధీరమల్లుడు సుబాహుడికి రాసింది. అందులో వున్న విషయం యిది: ధీరమల్లుడు తన కొద్ది సైన్యంతో, సర్పకేతుడి గొప్ప సైన్యసమూహాన్ని శివపురానికి ఉత్తరంగా వున్న ఎడారిప్రదేశంలో కలుసుకున్నాడు. సర్పకేతుడివెంట వున్న అన్ని వేలమంది సైనికులతో, తను ముఖాముఖిని పోరాడటం ప్రమాదకరం అని అతడు వెనుతిరగబోయేంతలో, సర్పకేతుడికి ఈ సంగతి కాస్తా తెలిసిపోయింది. అతడు కొంత సైన్యాన్ని వెంటపెట్టుకుని ధీరమల్లుడివెంట బడ్డాడు. ధీరమల్లుడు తన కొద్దిపాటి సైన్యంతో శివపురంకేసి పారిపోయి వస్తున్నాడు. ఆ కారణంవల్ల సుబాహుణ్ణి నగరంలో కొద్దిపాటి సైన్యాన్ని వుంచి, మిగిలిన సేనతో తనకు సహాయం రావలిసిందిగా అతడు కోరాడు.

"ఇది అనుకోని దుర్ఘటన, మహారాజా! సేనాని ధీరమల్లుడు ఈ నగర రక్షణలను చేరుకోకముందే, సర్పకేతుడితో అతడికి యుద్ధం తప్పకపోతే, అది మొదట ధీరమల్లుడి ఓటమికీ, తరవాత ఈ నగర నాశనానికీ దారితీస్తుంది. మనం సేనతో అతడికి రక్షణగా వెళ్లటం మంచిది," అన్నాడు సుబాహుడు. —(ఇంకా వుంది)





# పతివ్రత

ఒకప్పుడు బ్రిటనును సింబలైన్ అనే రాజు ఏలుతూ ఉండేవాడు. ఆయనకు ఇద్దరు కుమారులూ, ఇమొజెన్ అనే కుమార్తె కలిగిన అనంతరం ఆయన భార్య చనిపోయింది. సింబలైన్ కుమారులు పసివారై ఉండగా వారిద్దరినీ ఎవరో ఎత్తుకుపోయారు. ఆ తరవాత వారి జాడ తెలియనేలేదు.

మొదటి భార్య పోయాక సింబలైన్ మళ్లీ పెళ్లాడాడు. ఆయన రెండవ భార్యకుకూడా రెండవ పెళ్లే. మొదటి భర్తకు ఆమె ఒక కొడుకును కని ఉన్నది. తన సవతికూతురైన ఇమొజెన్‌పైన ఆమెకు ద్వేషం ఉన్నప్పటికీ, తన కుమారుడికీ, ఆమెకూ పెళ్లిచేసినట్టయితే తన భర్త అనంతరం ఇమొజెన్ రాణి అయినప్పుడు తన కొడుకు రాజు అవుతాడుగదా అని ఆమె ఆలోచించింది. అయితే ఇమొజెన్ ఆమె ఆలోచనలన్నీ తారుమారు చేసేసింది. ఆమె తన తండ్రికి గాని, సవతితల్లికిగాని చెప్పకుండా పాస్త్యూమస్ అనే యువకుణ్ణి పెళ్లాడేసింది.

ఈ యువకుడి తండ్రి ఒక యోధుడు. ఆయన సింబలైన్‌పక్షాన యుద్ధంచేస్తూ వీర మరణం పొందాడు. ఆయన చనిపోయే నాటికి గర్భిణిగా ఉన్న ఆయన భార్య ఒక మగపిల్లవాణ్ణి కని తానుకూడా చనిపోయింది. సింబలైన్ ఆ అనాథశిశువుపట్ల కనికరం వహించి, తన ఆస్థానంలోనే ఉంచి చదివించి పెద్దవాణ్ణి చేశాడు. ఆ కుర్రవాడికి పాస్త్యూమస్ అనే పేరుకూడా ఆయనే పెట్టాడు. పాస్త్యూమస్ అంటే తండ్రి మరణించినాక పుట్టినవాడని అర్థం.

ఇమొజెన్, పాస్త్యూమస్‌లు చిన్నతనం నుంచీ ఒకరిపట్ల ఒకరు ఎంతో స్నేహానురాగాలు కలిగి ఉంటూ, ఒక గురువువద్దనే చదువుకున్నారు. క్రమంగా వారి స్నేహం ప్రేమగా మారింది. వారిద్దరూ ఎవరికీ

విలియం షేక్స్పియర్



తెలియకుండా వివాహం చేసేసుకున్నారు. ఈ రహస్యం అందరికన్న ముందుగా రాణీకి తెలిసింది, ఆమె సింబలైన్‌కు చెప్పింది. సింబలైన్ ఆగ్రహావేశుడైనాడు. తన కుమార్తె సాధారణ పౌరుణ్ణి పెళ్లాడటమా! పాస్త్యూమస్‌కు ఆయన దేశబహిష్కరణ శిక్ష విధించాడు. పాస్త్యూమస్ బ్రిటన్‌దేశాన్ని విడిచిపెట్టి రోమ్ దేశానికి వెళ్ల నిశ్చయించాడు.

భార్యాభర్తలు ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకున్నారు. ఆ సమయంలో ఇమొజెన్ తన భర్తకు తన వేలిన ఉన్న ఉంగరం తీసి ఇస్తూ, దానిని తన ప్రేమచిహ్నంగా ఎల్లప్పుడూ ధరించమని కోరింది. అలాగే పాస్త్యూమస్‌కూడా ఇమొజెన్ చేతికి ఒక కంకణం తొడిగాడు. తరవాత వారిద్దరూ ప్రేమప్రమాణాలు చేసుకుని విడిపోయారు.

భర్త వెళ్లిపోయాక ఇమొజెన్‌కు జీవితం ఎడారిలాగా అయిపోయింది. రోమ్ చేరిన పాస్త్యూమస్ కొత్త స్నేహితులను సంపాదించాడు. వారిలో అనేక దేశాలవారున్నారు. ఒకనాడు ఆ యువకులమధ్య ఏ దేశపు స్త్రీలు ఎక్కువగా పతివ్రతాధర్మం ఆచరిస్తారన్న విషయమై చర్చ వచ్చింది. ప్రతి ఒక్కడూ తన దేశపు స్త్రీల సౌశీల్యాన్నే ఘనంగా చెప్పుకున్నాడు. అంతా విని పాస్త్యూమస్, "మీరు ఎన్నయినా చెప్పండి. నా భార్య ఇమొజెన్‌ను మించిన మహాపతివ్రత ప్రపంచంలో ఉండదు," అన్నాడు.

ఇయాకిమో అనే రోమను యువకుడికి ఈ మాట రుచించలేదు; రోమను స్త్రీలను మించిన పతివ్రతలు ఎక్కడా ఉండరని అతని నమ్మకం. అందుచేత అతను పాస్త్యూమస్‌తో వాదానికి దిగి, చిట్టచివరకు, "నీ భార్య పతివ్రత కాదని రుజువుచేస్తే ఏమి పందెం కాస్తావు?" అని అడిగాడు.

"నా ప్రేమచిహ్నమైన కంకణం నా భార్యవద్ద ఉన్నది. ఆమె వద్దనుంచి నీవు దాన్ని తెచ్చినట్టయితే ఆమె ప్రేమచిహ్నమైన

ఈ ఉంగరాన్ని నీకిచ్చేస్తాను," అన్నాడు పాస్త్యూమస్. ఇమొజెన్ పతివ్రత కాదని ఋజువు చెయ్యలేకపోతే పెద్ద మొత్తంలో డబ్బు పందెంగా ఒడ్డాడు ఇయాకిమో.

ఇయాకిమో రోమ్‌నుంచి బయలుదేరి బ్రిటనుకు వచ్చి ఇమొజెన్ దర్శనం చేసుకుని, "నేను మీ భర్తగారి మిత్రుణ్ణి!" అని చెప్పుకున్నాడు. ఇమొజెన్ అతనికి ఎంతో ఆదరంతో ఆతిథ్యమిచ్చింది. కాని ఆమె నిజమైన పతివ్రతేననీ, పరపురుషుణ్ణి ఎట్టి పరిస్థితిలోనూ ప్రేమించదనీ ఇయాకిమో గ్రహించాడు. ఇక అతను పందెం గెలవాలంటే మాయోపాయం తప్ప మార్గాంతరం లేదు. అతను ఇమొజెన్ పరిచారకులకు లంచంపెట్టి వారి సహాయంతో ఆమె శయ్యామందిరంలో ప్రవేశించి ఒక పెద్ద పెట్టెలో దాక్కున్నాడు.



రాత్రి ఇమొజెన్ నిద్రపోయాక అతను వెలికి వచ్చి, గది అంతా వివరంగా చూసి, అక్కడ ఉన్న అలంకారాలు మొదలైనవన్నీ కాగితంపైన రాసుకున్నాడు. తరవాత అతను ఇమొజెన్‌ను సమీపించి ఆమె మెడ మీద ఉన్న పుట్టుమచ్చను చూశాడు. చివరకు అతను ఆమె చేతినుంచి కంకణం ఉపాయంగా ఊడదీసి తిరిగి పెట్టెలోకి చేరుకుని, మర్నాడు రోమ్ నగరానికి బయలుదేరి వెళ్లాడు.

అతను పాస్త్యూమస్‌ను కలుసుకుని, "నీ భార్య నీవు అనుకున్నట్టు మహాపతివ్రత ఏమీ కాదు. నేను ఒక రాత్రి యావత్తూ ఆమె శయ్యామందిరంలో గడిపాను. ఆమె నాకు ఈ కంకణం ఇచ్చింది. ఆమె మెడ మీద ఒక పుట్టుమచ్చ ఉన్నది. కావాలంటే ఆమె శయ్యా మందిరాన్ని విపులంగా వర్ణించగలను," అన్నాడు.

అంతవరకూ ఇమొజెన్‌పై ఉండిన ప్రేమ యావత్తూ క్రోధంగా మారిపోయి పాస్త్యూమస్ తన వేలికి ఉన్న ఉంగరాన్ని ఇయాకి

మోకు ఇచ్చేశాడు. తరవాత అతను పీసా నియో అనేవాడికి ఒక ఉత్తరం రాస్తూ, "నా భార్య అయిన ఇమొజెన్ ఒక ద్రోహి. ఆమెను వెంటనే చంపెయ్యి. ఆమెకుకూడా ఒక ఉత్తరం రాస్తున్నాను. ఆమెను చంపే టందుకు అవకాశం ఆమెద్వారానే నీకు లభిస్తుంది," అని తెలిపాడు.

ఈ పీసానియో అనేవాడు ఇమొజెన్ పరి వారంలో ఉండేవాడు, చాలా వివేకం గల వాడు. ఇతనికి పాస్త్యూమస్ అంటేకూడా ఎంతో భక్తి. అతనికి ఆ విధంగా ఉత్తరం రాసిన పాస్త్యూమస్ తన భార్యకు మరొక లాగా రాశాడు: "నీవు పీసానియోను వెంట బెట్టుకుని వేల్స్‌దేశంలోని ఫలాని రేవుపట్ట ణానికి వచ్చినట్టయితే నేను అక్కడ నిన్ను కలుసుకుంటాను!"

తన భర్తను తిరిగి కలుసుకోబోతున్నానని ఇమొజెన్ చాలా సంతోషించింది. ఆమె ఎవరికీ తెలియకుండా పీసానియోవెంట వేల్స్‌దేశంలోని రేవుపట్టణానికి బయలుదేరి వెళ్లింది. తీరా అక్కడికి చేరే దారిలో పీసానియో ఆమెతో అసలుసంగతి చెప్పే శాడు. అయితే అతను పాస్త్యూమస్ అజ్ఞ ప్రకారం ఇమొజెన్‌ను చంపదలచలేదు. "ఎవడో దుర్మార్గుడు నీ భర్త మనసులో విషం పోసిఉంటాడు. ఆ విషం దిగిపోయే



దాకా మనం చేసేదేమీ లేదు," అని అతను ఆమెతో అన్నాడు.

ఇమొజెన్ తన తండ్రివద్దకు తిరిగి వెళ్ల దలచలేదు, వీలయితే రోమ్‌లో తన భర్త ఉన్నచోటికే పోదలచింది. అలా అయితే, ఎవరూ గుర్తించకుండా పురుషవేషం వేసుకోవటం మంచిదని పీసానియో సలహా ఇచ్చాడు. అతను ఆమెకు ఒక ఔషధం కూడా ఇస్తూ, "అరోగ్యం చెడిపోయినప్పు డీ మందు పుచ్చుకో. ఇది మంచి ఔషధమని రాణీగారు నాకిచ్చారు," అన్నాడు.

ఇమొజెన్‌కు అంతరంగికుడుగా ఉంటూ అన్నివిధాలా తోడ్పడుతున్నాడని పీసానియోను చంపటానికి రాణీ వైద్యుణ్ణి విషం ఇవ్వమని అడిగి ఉండింది. ఆ వైద్యుడు ఆమె దుష్టురాలని ఎరిగి, ఆమెకు ఒకరకమైన మత్తుమందు ఇస్తూ అది ప్రాణాపాయకరమైన విషమని చెప్పాడు. ఆ మత్తుమందే ఇప్పుడు ఇమొజెన్‌వద్దకు చేరింది.

ఇమొజెన్ మగదుస్తులు ధరించి రేవు పట్టణానికి బయలుదేరింది. ఆమె అడవి మార్గాన నడుస్తూ ఒక గుహవద్దకు వచ్చింది. ఆమెను ఆకలి దహించివేస్తున్నది. గుహలోకి తొంగిచూసేసరికి అక్కడ మనుషులు లేరు గాని అందులో ఆహారం ఉన్నట్టు తెలిసిపోయింది. అందులో నివసిస్తున్నవారు





రాగానే వారికి డబ్బు ఇవ్వవచ్చుననుకుని అమె వెంటనే భోజనంచేసి తన ఆకలి తీర్చుకున్నది.

ఆ గుహలో ఉంటున్నది మరెవరో కాదు, ఇమొజెన్ అన్నలూ, వారిని పసితనంలో ఎత్తుకుపోయిన బెలారియస్ అనేవాడూనూ. ఈ బెలారియస్ ఒకప్పుడు సింబలైన్‌వద్ద కొలువుండేవాడు. అయితే సింబలైన్ అతనిపై రాజద్రోహనేరం అకారణంగా అంటగట్టి దేశంనుంచి వెళ్లగొట్టాడు. ఆ కసితో బెలారియస్ రాజకుమారుల నిద్దరినీ కాజేసి పారిపోయి వచ్చి ఈ గుహలో నివాసం ఏర్పాటు చేసుకున్నాడు. రానురాను బెలారియస్‌కు వాళ్లపై మమకారం ఏర్పడింది. అందుచేత అతను వారిని తన సొంత కొడుకులల్లేనే చూడసాగాడు. వారు అడవిలో వేటాడి జీవితం గడుపుతూ వస్తున్నారు.

ఆ ముగ్గురూ వేటనుంచి తిరిగివస్తూనే మగవేషంలో ఉన్న ఇమొజెన్‌ను చూశారు. ఇమొజెన్ తాను వారి ఆహారం తీసుకున్న సంగతి చెప్పి వారికి డబ్బు ఇవ్వబోయింది. కాని వాళ్లు డబ్బు తీసుకోక ఆమెనుగురించి అడిగారు. తాను రేవుపట్నానికి వెళ్లి అక్కడి నుంచి రోమ్ నగరానికి వెళుతున్నట్టు ఆమె వారితో చెప్పింది. ప్రయాణం బడలిక తీరినాక వెళ్లవచ్చుననీ, అంతదాకా తమ అతిథిగా ఉండమనీ వారామెను కోరారు.

ఆ యువకులిద్దరూ తన అన్నలని తెలియకపోయినప్పటికీ ఆమెకు వారిపై ఏదో అభిమానం కలిగింది. మరసటి రోజున వారు ముగ్గురూ వేటకు వెళ్లాక ఇమొజెన్ తన శరీరస్థితి ఏమంత బాగాలేదనుకుని, పీసానియో ఇచ్చిన మందు కాస్త తాగేసింది. ఆమెకు ఒంట్లో బాగాలేకపోయినట్టుండటానికి ఒక కారణం భర్త మనసు అకారణంగా విరిగిపోవటం, రెండవ కారణం తిండీ, సరిఅయిన నిద్రా లేకుండా ఆమె రెండు రోజులపాటు చేసిన ప్రయాణం.



ఇమొజెన్ తాగిన మందు మత్తుమందు. దాని ఫలితంవల్ల ఆమెకు స్పృహ తప్పి ప్రాణం పోయినట్టే కనిపించింది. వేటనుంచి తిరిగి వచ్చిన ముగ్గురూ తమ అతిథి మరణించినట్టే భావించారు. వారామె కోసం చాలాసేపు దుఃఖించి, చివరకు అరణ్యంలో ఒక గుంటలో ఆమె శరీరాన్ని ఉంచి, పైన ఎండుటాకులు కప్పారు.

మత్తుమందు ప్రభావం పోగానే ఇమొజెన్ తన పైన కప్పిఉన్న ఎండుటాకులను తోసేసుకుని లేచింది. తాను ఒక గుహను చేరటమూ, అక్కడ తనకు ముగ్గురు పురుషులు ఆతిథ్యమివ్వటమూ మొదలైన వన్నీ కలలో వార్తలని రూఢిచేసుకుని ఆమె రేవు పట్టణానికి మళ్ళీ బయలుదేరింది.

ఈలోపుగా రోమ్‌కూ బ్రిటనుకూ మధ్య యుద్ధం ఒకటి ఏర్పడింది. రోమునుంచి సైన్యాలు బ్రిటనుకు బయలుదేరాయి. ఈ సేనవెంట పాస్థ్యూమస్‌కూడా ఉన్నాడు. తన ఆజ్ఞప్రకారం ఇమొజెన్‌ను చంపేశానని పీసానియో అతనికి ఉత్తరం రాశాడు. అది మొదలు అతనికి ప్రాణంపై విరక్తి పుట్టింది. ఇమొజెన్ దోషి అని అతను ఇంకా నమ్మి నప్పటికీ తన మూలంగా ఆమె చనిపోయిందనుకుని అతను కుంగిపోయాడు. అందుచేత అతను ఈ యుద్ధంలో చేరాడు. యుద్ధంలో తాను చనిపోవచ్చు; లేదా తాను బ్రిటనుకు తిరిగి వచ్చినందుకు సింబలైన్ తనను ఉరితీయవచ్చు. ఈ రెంటిలో ఏది జరిగినా మేలే అని అతను భావించాడు.

రోము సైన్యాలు ఇమొజెన్ ఉన్న అడివి కుండానే వస్తున్నాయి. దారిలో ఆమెను సైనికులు పట్టుకుని తమ సేనాపతివద్దకు తీసుకుపోయారు. ఆమె ఇంకా మగవేషం లోనే ఉన్నది. సేనాపతి ఆమెను చూసి ఎవరో తెలివిగల కుర్రవాడుగా కనిపిస్తున్నా డనుకుని తనవెంట నౌకరుగా ఉండమని ఆదేశించాడు.

త్వరలోనే ఉభయపక్షాలకూ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాజైన సింబలైన్‌కు ప్రాణాపాయస్థితి సంభవించింది. ఆ క్షణంలో బెలారియస్ తన ఇద్దరు పెంపుడు కొడుకులతోనూ రాజు ప్రాణాలకు తమ ప్రాణాలు అడ్డువేసి వీరోచితంగా యుద్ధం చేశాడు. రోమ్‌పక్షాన వచ్చిన పాస్థ్యూమస్‌కూడా సింబలైన్‌పక్షాన పోరాడాడు. వీరి పరాక్రమం మూలంగా అపజయం కాస్తా విజయంగా మారింది. రోమ్ సేనాపతీ, పాస్థ్యూమస్‌కూ ఇమొజెన్‌కూ తీరని ద్రోహం చేసిన ఇయాకిమో, సింబలైన్‌కు ఖైదీలుగా చిక్కారు. తాను ఆశించినట్టు పాస్థ్యూమస్ యుద్ధంలో చావలేదు, అందుచేత అతను తనకు తానై బ్రిటను సేనాధికారులకు ఖైదీగా లొంగిపోయాడు. మగవేషంలో ఉన్న ఇమొజెన్ కూడా రోము సేనాపతితోబాటు ఖైదీ అయింది. ఆమెను ఎవరూ గుర్తించలేదు. ఆమె మాత్రం, తన భర్త మారువేషంలో ఉన్నప్పటికీ అతనిని గుర్తించింది. ఆమె ఇయాకిమో చేతిన తన ఉంగరం—తాను తన భర్తకు ఇచ్చినది—ఉండటం గమనించి, అది అతనికి ఎలా చేరిందీ ఊహించలేకపోయింది. ఆమె తన తండ్రి వెంట పీసానియో ఉండటంకూడా గమనించింది. అతను ఒకడే ఆమెను గుర్తించాడు.



బెలారియస్, అతని పెంపుడు కొడుకులూ తమ అతిథిని గుర్తించారుగాని, చచ్చిపోయినవారు మళ్లీ బతకరు గనక, మనిషిని పోలిన మనుషులుండరా అనుకున్నారు.

ఓడిపోయిన రోము సేనాపతి సింబలైన్‌తో, "మహారాజా, యుద్ధ ఖైదీలను డబ్బు తీసుకుని విడిచిపుచ్చే ఆచారం మీకు లేదనీ, వారిని మీరు ఉరి తీస్తారనీ నేను విన్నాను. నామటుకు నేను నిశ్చింతగా ప్రాణాలు వదులుతాను, కాని నాకు ఎంతో ప్రేమగా సేవ చేసిన ఈ యువకుడి ప్రాణాన్ని మాత్రం తీయవద్దని నా ప్రార్థన," అంటూ ఇమొజెన్‌ను చూపాడు.

ఇమొజెన్‌ను చూసి గుర్తించకపోయినప్పటికీ సింబలైన్‌లో సహజ వాత్సల్యం అంకురించింది. "నాయనా, నీ ప్రాణం తీయను, నీకు ఏదైనా వరం కావాలంటే కోరుకో!" అన్నాడాయన.

"నా ప్రాణంకోసం అడగకేం!" అన్నాడు రోము సేనాపతి ఇమొజెన్‌తో.

ఇమొజెన్ విచారంతో, "దానికన్న నాకు ముఖ్యమైనది వేరే ఉన్నది, నేనేం చెయ్యను ?" అన్నది. ఆమె ఇయాకిమో చేతికేసి చూస్తూ, "ఆ మనిషికి ఆ ఉంగరం ఎలా వచ్చిందో నిజం బయట పెట్టించండి. అదే నేను కోరే వరం" అన్నది రాజుతో.



"ఆ ఉంగరం నీకెలా వచ్చిందో చెప్పక పోయావంటే నిన్ను చిత్రహింసలకు గురిచేస్తాను!" అన్నాడు సింబలైన్ ఇయాకిమోతో.

ఇయాకిమో దాచకుండా అంతా చెప్పేశాడు. తాను పాస్థ్యూమస్‌తో పందెంవెయ్యటమూ, ఇమొజెన్ శయ్యామందిరంలో చేరి ఆమె కంకణం హరించటమూ, తన మోసాన్ని నమ్మి పాస్థ్యూమస్ తనకు ఉంగరాన్ని ఇచ్చివెయ్యటమూ వివరంగా అతను బయటపెట్టేశాడు.

ఈ కథ వింటూనే పాస్థ్యూమస్ శోకంతో తల్లడిల్లిపోయి, తన భార్యకు చేసిన మహాపచారానికి నిలువునా దగ్ధుడైనట్టు బాధపడ్డాడు. అతని బాధ చూడలేక ఇమొజెన్ తన మారువేషం తీసేసి తన భర్తను ఊరడించింది.

ఇమొజెన్‌ను చూసి భర్త ఎంత ఆనంద పారవశ్యం చెందాడో తండ్రికూడా అంతగానూ సంతోషించాడు. ఆయన పాస్థ్యూమస్‌ను తన అల్లుడుగా గుర్తించి, అతనిపై విధించిన దేశ బహిష్కరణశిక్ష రద్దుచేశాడు.

ఈ ఆనందసమయంలో బెలారియస్ కూడా సింబలైన్‌వద్దకు తన పెంపుడు కొడుకులతో వచ్చి, తాను ఎవరో చెప్పుకుని, "మహారాజా, ఇదుగో నీ కుమారులు!" అంటూ తాను పెంచిన యువకులను చూపాడు. సింబలైన్ ఆనందాని కిప్పుడు హద్దులు లేవు. ఆయన రోమ్ సేనాపతికి స్వేచ్ఛ ఇచ్చి అతనితో సంధి చేసేసుకున్నాడు. చిట్టచివరకు, ద్రోహి అయిన ఇయాకిమోకు కూడా శిక్ష ఏమీ పడలేదు.

ఈవిధంగా సింబలైన్ తన కొడుకులనూ, కుమార్తెనూ, అల్లుణ్ణీ తిరిగి సంపాదించుకుని వారితో సుఖంగా వున్నాడు. ఆయన రెండవ భార్యమాత్రం ఇతరులు ఇంత ఆనందించటం చూడలేక మంచంబట్టి మరణించింది.





# తెప్పకొయ్య

పడమటితీరాన కొండప్రాంతంలోని బదిరి గ్రామంలో ఒక పల్లెవాడు ఉండేవాడు. వాడు రోజూ తన తెప్పమీద సముద్రంలోకి వెళ్లి చేపలు పట్టి జీవిస్తూ ఉండేవాడు. ఇలా ఉండగా వాడి తెప్ప కాస్తా పగిలిపోయింది. ఇంకొక తెప్పకొయ్య తయారు చేసుకుందా మనే ఉద్దేశంతో, మంచి దుంగను వెతుకుతూ ఒకనాటి సాయంకాలం కొండలలోకి బయలుదేరాడు. ఎంతదూరం వెళ్లినా తెప్పకొయ్యకు పనికివచ్చే దుంగ కనిపించనే లేదు. ఇంతలో ఆకాశాన మబ్బులు కమ్మి ఆ ప్రదేశమంతా చీకటి అయింది. అసలే తెలియని ప్రాంతం కావటంచేత వాడు ఇంటి దారి పట్టాడు.

అయితే పల్లెవాడు ఆ చీకటిలో ఎక్కడో దారి తప్పిఉండాలి. ఎందుచేతనంటే ఎంత సేపు నడిచినా కొండలే తప్ప సముద్రం కంట పడలేదు. చుట్టూ గాఢాంధకారం; కన్ను పొడుచుకున్నా కనిపించటంలేదు. చినుకు కూడా సాగింది. "వానకు తడుస్తూ, ఆకలికి మాడుతూ నేను తెల్లవార్లూ ఈ కొండలమీద ఉండిపోవలిసిందేనా?" అని వాడు విచారపడుతూండగా అంత దూరాన మిణుకు మిణుకుమని దీపం కాంతి కనపడింది.

పల్లెవాడికి పోయే ప్రాణాలు తిరిగి వచ్చి నట్టయింది. వాడు ఆ దీపం కనపడే దిక్కుగా వెళ్లి ఒక కుటీరాన్ని చేరుకున్నాడు. చాలాసేపు తలుపు తట్టినాక ఒక ముసలివాడు తలుపు తెరిచాడు.

"నేను దారి తప్పాను. ఈ రాత్రికి ఇంత తిండిపెట్టి ఇక్కడ పడుకోనిస్తావా, తాతా?" అన్నాడు పల్లెవాడు.

"లోపలికి రా! ఇక్కడికి అయిదారు మైళ్ళ దూరంలో ఎక్కడా ఇల్లు లేదు," అన్నాడు ముసలాడు.

బి. చలపతిరావు



లోపల ముసలాడి భార్య ఫలహారం తయారు చేస్తున్నది. ఆమె పల్లెవాడితో ఏమీ మాట్లాడలేదు. ముసలివాడితోకూడా ఆమె ఒక్క మాట మాట్లాడలేదు. వంట పూర్తి కాగానే ముగ్గురూ తేలికగా ఫలహారం చేసి పడుకున్నారు. పల్లెవాడు కళ్లుమూసుకున్నప్పటికీ వాడికి నిద్ర పట్టలేదు. "ఈ ముసలి వాళ్లు ఈ నిర్జన ప్రదేశంలో ఎందు కుంటున్నారు? వాళ్లు ఒకరితో ఒకరు మాట్లాడు కోరేం? వీళ్ల రహస్యం ఏమిటో తెలుసుకోవాలి!" అనుకున్నాడు వాడు.

అర్ధరాత్రివేళ ముసలివాడు మెల్లిగా లేచి, పిల్లిలాగా నడుస్తూ ఒక మూల ఉన్న పెట్టెవద్దకు వెళ్లాడు. వాడు ఆ పెట్టెమూత ఎత్తి అందులోనుంచి ఒక నీలంరంగు కుళాయి తీయటం పల్లెవాడు చూశాడు. ముసలివాడు ఆ కుళాయి నెత్తిన పెట్టుకుని, "కాశ్మీరం! కాశ్మీరం!" అన్నాడు. వెంటనే ఇంద్రజాలంలాగా ముసలివాడు మాయమైపోయాడు. తరవాత ముసలిది లేచి పెట్టె దగ్గిరికి వెళ్లి, అందులోనుంచి ఇంకొక నీలం కుళాయి తీసి నెత్తిన పెట్టుకుని, "కాశ్మీరం! కాశ్మీరం!" అన్నది. తరవాత ఆమెకూడా అంతర్ధానమయింది.

పల్లెవాడు ఇదంతా చూసి కొంతసేపు దిగ్భ్రమచెందాడు. ముసలివాళ్లిద్దరూ లేరని రూఢిచేసుకుని, వాడుకూడా లేచి పెట్టె వద్దకు వచ్చి, దాని మూత తెరిచి చూశాడు. అందులో ఇంకా రెండు మూడు నీలంరంగు కుళాయిలున్నాయి. వాటిలో ఒకటి తీసి నెత్తిన పెట్టుకుని, "కాశ్మీరం! కాశ్మీరం!" అన్నాడు వాడు.

వెంటనే వాడి కళ్లు బరువుగా మూసుకుపోయాయి, తనమీదిగా గాలి విపరీతమైన వేగంతో వీస్తున్నట్టు అనిపించింది. ఆ గాలి హోరు ఆగిపోయాక కళ్లు తెరిచిచూస్తే వాడు ఒక రాజభవనం భోజనశాలలో ఉన్నాడు. ముసలిదంపతులు రాజుగారు

తినగా మిగిలిన ఆహారం తిని మూటలు కట్టుకుంటున్నారు. బంగారు లోటాలూ, గిన్నెలూకూడా వాళ్ల మూటల్లోకి వెళ్లి పోతున్నాయి. పల్లెవాణ్ణి చూడగానే వాళ్ళు నీలంకుళాయిలు నెత్తిన పెట్టుకుని, "బదిరి కొండలు! బదిరి కొండలు!" అంటూ మాయమైపోయారు.

వాళ్లు వెళ్లిపోయాక ఇక తనను అడ్డే వారు లేరనుకుని పల్లెవాడు నిర్విచారంగా తనకు కావలిసిన ఆహారమంతా తిన్నాడు. తరవాత రాజుగారి ద్రాక్షసారాయం వాడి కంటబడింది. దాన్ని తెగ తాగి వాడు ఒళ్లు తెలియకుండా అక్కడే పడిపోయాడు.

తెల్లవారుజామున రాజుగారి నౌకర్లు పల్లె వాణ్ణి భోజనశాలలో చూసి పట్టుకుని, పెడ రెక్కలు విరిచికట్టి రాజుగారి ఎదటికి తీసుకుపోయి, "మహారాజా, రోజూ ఎవరి కంటా బడకుండా రాజభవనంలోకి జొరబడి దొంగతనాలు చేస్తున్న గజదొంగ వీడే!" అని చెప్పారు.

"ఇంత నేర్పరి అయిన దొంగ బతికి ఉండటం మంచిదికాదు. వీణ్ణి ఒక స్తంభా నికి కట్టి, చుట్టూ చితి పేర్చి అందులో వీణ్ణి సజీవంగా దహనం చేసెయ్యండి," అని రాజుగారు ఉత్తరువిచ్చాడు.



పల్లెవాణ్ణి రచ్చబండవద్దకు తీసుకు పోయారు. అక్కడ ఒక పెద్ద దూలం పాతి వాణ్ణి దానికి మోకులతో కట్టారు. తరవాత వాడిచుట్టూ నలుచదరంగా చితి పేర్చి దాన్ని నాలుగు మూలలా అంటించారు.

ఈ గజదొంగను చూడటానికి నగరం లోని ప్రజలు ఆబాలగోపాలమూ వచ్చారు. ఎందుకంటే రాజుగారి ఇంట రోజూ ప్రవే శించే దొంగను పట్టుకోవడానికి విశ్వ ప్రయత్నాలు జరిగాయి. రాజభవనంచుట్టూ రక్షకభటులు దడిలాగా నిలబడినప్పటికీ దొంగ ఎవరి కంటా పడకుండా లోపలికి రానూ వచ్చాడు, మళ్లీ బయటికి పోనూ

పోయాడు! ఈ దొంగ మనిషి కాదనీ, ఏదో భూతమనీకూడా ప్రజలు అనుకునేవారు. అందుచేత పట్టుపడ్డాడనగానే ప్రజలు దొంగను చూడవచ్చారు.

మంటలు దగ్గిరికి వస్తున్నాయి. పల్లెవాడు తనకు ఆయువు చెల్లిపోయిందనే అనుకున్నాడు. ఇంతలో వాడికి నీలంకుళాయి జ్ఞాపకం వచ్చింది. వాడు న్యాయాధికారికేసి తిరిగి, "బాబూ, ఒక్క తుదికోరిక. నా నీలంకుళాయి నా నెత్తిన పెట్టించండి. అది అంటే నాకెంతో ప్రాణం! దాన్నికూడా నాతోపాటు కాలి బూడిద కాని వ్వండి!" అన్నాడు.

ఈ కోరిక న్యాయాధికారికి సబబుగానే కనిపించింది. ఆయన ఆజ్ఞాపించినమీదట ఒక భటుడు చితి ఎక్కివెళ్లి నీలంకుళాయిని పల్లెవాడి నెత్తిన పెట్టాడు. పల్లెవాడు వెంటనే, "బదిరికొండలు! బదిరికొండలు!" అంటూ అదృశ్యమైనాడు. వాడితోబాటు వాణ్ణి కట్టిన దూలమూ, కట్టుతాళ్లూకూడా మాయమయాయి. ఈ గజదొంగ మనిషి కాదని ప్రజలు రూఢిచేసుకున్నారు.

పల్లెవాడు బదిరికొండలు చేరుకున్నాడు. తన కట్లు విప్పటానికి ఎవరైనా దొరుకుతారేమో అని తల ఎత్తి చూస్తే ఎదురుగా వస్తూ ఒక మనిషి కనిపించాడు.

"బాబ్బాబు! నీకు పుణ్యం ఉంటుంది, ఈ కట్లు కాస్త విప్పు!" అన్నాడు వాడు ఆ మనిషితో.

"నువు ఈ చోటుగాని చోట ఈ దూలాని కెట్టా కట్టుబడ్డావూ? ఇదేదో మంచి దేవదారు దూలంలాగుందే!" అన్నాడు ఆ మనిషి కట్లు విప్పుతూ.

"అవునవును. నాకు తెప్పకొయ్య కావలిసి దీన్ని తెచ్చుకున్నాలే. కాశ్మీరు మహారాజు గారు స్వయంగా దీన్ని నాకు బహుమతి చేశారు!" అంటూ పల్లెవాడు ఆ దూలాన్ని భుజానికెత్తుకుని ఇంటిదారి పట్టాడు.



# అసలు కీలకం

ఒక ధనికుడైన కాపుకు ఒక కూతురుండేది. ఆ పిల్లకు గొప్ప సంబంధం దొరికింది. పెళ్లి ముహూర్తం నిశ్చయించి భారీ ఎత్తున పెళ్లి ప్రయత్నాలు సాగించారు.

కాపువద్ద ఉన్న ఎడ్లకు మామూలుకంటె పని జాస్తి అయింది. వాటికి బొత్తిగా తిండీ, విశ్రాంతీ లేకుండాపోయాయి. ఒకనాడు అవి తమలో తాము ఇలా అనుకున్నాయి:

"చూశావా, యజమాని కూతురు పెళ్లిగదా అని అందరికీ ఉత్సాహంగా ఉంది. మనమే ఒళ్లు విరుచుకుని చస్తున్నాం. మనకన్న ఆ గొర్రెలూ, మేకలూ ఎంతో నయం! వాటికి ఈమధ్య ఏమి తిండి పెట్టినా పెడుతున్నారు. మన తిండి సంగతి చూసేవారే లేరు."

ఈ మాటలను విన్న ఇంటికుక్క ఎద్దులతో, "పిచ్చిమొహాల్లారా! గొర్రెలనూ, మేకలనూ పెళ్లివిందుకు కోసుకుతింటారు. అందుకే వాటిని మేపుతున్నారు. వాటిని చూసి మీరెందుకు అసూయపడతారు?" అన్నది.



# అధికారచిహ్నం



కుక్కల కథలు:

# 1. భయమెరుగని కుక్క

"బుల్ డాగ్" అనే జాతి కుక్కలకు భయమంటే ఏమిటో తెలియదు. దీనికి తార్కాణం ఈ కింది సంఘటన.

అమెరికాలోని జార్జియా రాష్ట్రంలో మిస్టర్ బర్డ్ ఫ్రాంక్లిన్ అనే ఆయన ఒక రైతు. ఆయన "బుల్ డాగ్" జాతికి చెందిన ఒక కుక్కను పెంచాడు.

ఫ్రాంక్లిన్ ఆపనీ ఈపనీ చూసుకుంటూ నిత్యమూ తన వ్యవసాయక్షేత్ర మంతటా తిరిగేవాడు. ఎప్పుడూ కుక్క ఆయన వెంటే ఉండేది.

ఒకనాడు ఫ్రాంక్లిన్ తన పొలంమీదుగా ఒక ఎద్దును తీసుకువస్తున్నాడు. అలవాటు ప్రకారం కుక్కకూడా ఆయన వెంటనే నడుస్తున్నది. పాశ్చాత్యదేశాలలో ఉండే ఎద్దులు రెచ్చిపోయినప్పుడు చాలా అపాయకరమైనవి.

ఉన్నట్టుండి ఫ్రాంక్లిన్ ఎద్దుకు ఎందుకో ఆవేశం వచ్చేసింది. అది ఆవేశంతో తన యజమానిని కుమ్మి పడదోసింది. ఫ్రాంక్లిన్ ఆ దెబ్బకు తట్టుకుని లేచి నిలబడలేకపోయాడు. ఈ లోపుగా ఎద్దు మళ్లీ ఆయనపైకి దూకబోయింది.

ఇంతలో కుక్క తన యజమానికి రానున్న ఆపద గ్రహించి, ప్రాణభయం అన్నది ఎరగకుండా ఒక్క ఎగురు ఎగిరి ఎద్దు ముఖంమీదికి దూకి దాని ముట్టెలో తన బలమైన కోరలు దిగవేసి భల్లూకపు పట్టు పట్టేసింది.

ఎద్దు కుక్కను విదిలించి వదిలించుకోవాలని చూసింది గాని అది దానికి సాధ్యం కాలేదు. ఈ లోపుగా ఫ్రాంక్లిన్ లేచి కుంటుకుంటూ, తన ప్రాణం కాపాడిన కుక్కను కాపాడటానికిగాను సహాయం తీసుకు రాబోయాడు.

అయితే కుక్క ప్రాణం దక్కలేదు. ఎద్దు విదిలింపులకు దాని బలం క్షీణించింది. క్రమంగా అది పట్టు తప్పి కింద పడిపోయింది. వెంటనే ఎద్దు దానిని తన పాదాలతో మట్టగించి చంపేసింది.

ఆస్పత్రిలో ఫ్రాంకిన్ల్ తన గాయాలన్నిటినీ నయంచేసుకున్నాడు, కాని తనకోసం ప్రాణాలు అర్పించిన తన పెంపుడుకుక్క చనిపోవటం ఆయన హృదయంలో మానని గాయంగా మిగిలిపోయింది.



# జరగని ప్రతీకారం



పట్టు వదలని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ నారంభించాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ప్రజలలో అక్కడక్కడా అపారమైన రాజభక్తి ఉండటం ఎరుగుదుము. అటువంటివారు తమ రాజుకోసరం ప్రాణాలైనా వదులుతారు. కాని నీలాగా ఒక పౌరుడికోసం ఇంత సహనంతో శ్రమపడేవాళ్లను ఎక్కడా చూడలేదు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు మందహాసుడనే రాజభక్తుడి కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు :

పూర్వం కైలాసవతీనగరంలో మందహాసుడనే సుక్షత్రియుడుండేవాడు. అతను సంపన్నుడు, గంభీరస్వభావం గలవాడు. అతను తన సాటి క్షత్రియ కన్యను, నీలాలక

## బేతాళ కథలు



అనే ఆమెను ప్రేమించి వివాహమాడ గోరాడు. ఆమెపైన తనకు గల ఆదరాభి మానాలను ఎన్నోవిధాల ప్రదర్శించి, ఆమె కోసం ప్రాణాలనైనా త్యాగం చెయ్యగలనని స్పష్టంచేశాడు.

అయితే నీలాలక మందహాసుణ్ణి ప్రేమించ లేదు. ఆమె ధృతవర్మ అనే మరొక సామం తుణ్ణి ప్రేమించింది.

కొన్నాళ్ళతరవాత నీలాలక ధృతవర్మను పెళ్ళాడింది. కాలక్రమాన వారికొక కుమారుడుకూడా కలిగాడు.



నీలాలకను తాను పెళ్ళాడలేకపోవటమూ, ధృతవర్మ పెళ్ళాడటమూ మందహాసుడి హృదయంలో శూలపుపోటులాగా అయింది. "ఏనాడు అవకాశం దొరికితే ఆనాడు ఆ ధృతవర్మను నా కత్తికి బలిచేస్తాను!" అని మందహాసుడు ఘోరప్రతిజ్ఞ చేశాడు. ధృత వర్మను చంపటం తప్ప తనకు మరొక జీవితలక్ష్యం లేకుండా అందుకోసమే బతుకుతున్నవాడిలాగా కనిపించాడు.

కైలాసవతీనగరపు రాజుకు ఒక దాయాది ఉన్నాడు. అతను అదివరకు ఒకసారి రాజును చంపి తానే రాజు కావాలని ప్రయ త్నించగా రాజుగారు తరుణంలో పసికట్టి ఆ ద్రోహిని దేశంనుంచి వెళ్లగొట్టించాడు. దేశం విడిచి వెళ్లికూడా ఆ దుర్మార్గుడు తన ప్రయత్నాలను మానలేదు. రాజుగారి సామంతులలో కొందరిని రహస్యంగా తన పక్షం చేసుకుని వారిని తిరుగుబాటుకు పురి కొల్పాడు. సామంతులు రాజుపై తిరుగు బాటు చేసే సమయానికి ఆ ద్రోహి కొంత సైన్యంతోకూడా రాజ్యంపైకి దండెత్తి వచ్చాడు.

రాజుగారిపైన తిరుగుబాటు చేసిన సామంతులలో ధృతవర్మకూడా ఉన్నాడు. ఈ సంగతి తెలియగానే మందహాసుడు తన బలాలతోసహా రాజుగారి పక్షాన పోరాడ టానికి వెళ్లాడు. యుద్ధరంగంలోనైనా ధృత

వర్మ తనకు అందకపోతాడా అని మంద హాసుడి ఆశ.

యుద్ధం కొద్దిగంటలలో ముగిసింది. తిరుగుబాటుదార్లు ఓడి యుద్ధరంగంనుంచి పారిపోయారు. వారిని తరిమి పట్టుకుని శిర చ్ఛేదం చెయ్యమని రాజుగారు తన పక్షాన పోరిన సామంతులకు ఉత్తరు విచ్చాడు. అయితే నిజమైన దీక్షతో రాజద్రోహులను వేటాడినవారు ఇద్దరు ముగ్గురు మాత్రమే. మిగిలిన సామంతుల కిది చాలా అమాను షంగా తోచింది.

రాజద్రోహులను దీక్షతో వేటాడినవారిలో మందహాసు డొకడు. ఓడిపోయినవాళనూ, పారిపోయినవాళ్లనూ వేటాడటం అతనికి కూడా క్రూరమనే అనిపించింది. కాని అతను వేటాడినది ఒక్క ధృతవర్మకోసమే. ఆ ధృతవర్మ యుద్ధరంగంలో తన పాల పడకుండా తప్పించుకున్నాడు. అతని ప్రాణాలు తీస్తానని మందహాసుడు చేసిన ప్రతిజ్ఞ నెరవేరనేలేదు.

తిరుగుబాటుదార్లు ఎంతోమంది దొరి కారు, మరణశిక్ష పొందారు. కాని ధృతవర్మ దొరకలేదు.

అతను దేశం దాటి పారిపోక ముందే ఎలాగైనా వెతికి పట్టుకోవాలని మంద హాసుడి ఉద్దేశం.





యుద్ధరంగంనుంచి పారిపోయిన తిరుగు బాటుదార్ల జాడలు దారిలో కనిపించినవారి ద్వారా తెలుసుకుంటూ, ఒకనాడు చీకటి పడి మందహాసుడు తన భటులతోసహా ఒక గ్రామం చేరి, అక్కడి సత్రంలో ఆ రాత్రికి బస ఏర్పాటు చేసుకున్నాడు. ఇంతలో ఆ సత్రంలో చేరిన మనుషుల సంభాషణను బట్టి ఆ గ్రామం చివర ఒక పాడుపడిన ఇంట్లో ఎవడో తిరుగుబాటుదారు ఉంటు న్నట్టు తెలిసింది.

వెంటనే మందహాసుడు తన భటులను దివిటీలతోసహా తన వెంట రమ్మని ఆజ్ఞా పించి ఆ పాడుబడిన ఇంటిని వెతు క్కుంటూ బయలుదేరాడు. ఇల్లు సులువు గానే దొరికింది. మందహాసుడు ఇంటి తలుపు తట్టి, "ఎవరు లోపల?" అని బిగ్గరగా కేక పెట్టాడు.

ఒక ఆడమనిషి తలుపు తెరిచింది. లోపల ఎక్కడో ఒక్క దీపం మినుకు మినుకు మంటున్నది. దివిటీలు పట్టుకున్న భటులు దూరంగా ఉండటంచేత ఆ తలుపు తెరిచిన మనిషి నీలాలక అని మంద హాసుడు పోల్చుకోలేదు. ఆమె అవతారం కూడా వికృతంగా ఉన్నది.

"ఎవరు మీరు? ఏంకావాలి?" అన్న దామె మందహాసుడితో.







నీలాలక గబగబా లోపలికి వెళ్ళి నిద్ర పోతున్న తన కొడుకును ఎత్తుకున్నది. ఇంటి కప్పు అప్పుడే అక్కడక్కడా అంటుకున్నది. ఆమె బయటికి పరిగెత్తుకువచ్చి, "నా భర్త గాయపడి లోపల ఉన్నారు. ఆయనను సజీవంగా దహించేస్తే మీకేం ఒరుగుతుంది? ఆయనమీద మీకు పగ ఎందుకు? నేనాయ నను ప్రేమించి పెళ్ళాడాను. కావలిస్తే నా ప్రాణాలు తీసుకోండి. వీడు నా కొడుకు. నన్ను చూసి కాకపోతే, ఏ పాపమూ ఎరగని వీణ్ణి చూసిఅయినా నా భర్తను కాపా డండి!" అని కన్నీరు కార్చుతూ మంద హాసుడి కాళ్ళపైన పడింది.

"ఈ ఇంట్లో ఎవరున్నారు?" అని మంద హాసుడు గద్దించి అడిగాడు.

"నేనూ, నా కొడుకూనూ!" అన్నది నీలాలక.

ఆమె మందహాసుడి గొంతు పోల్చుకుని తన భర్తకు ప్రమాదం రానున్నదని భయ పడసాగింది.

"అయితే మీరిద్దరూ తక్షణం ఇల్లు విడిచి వెళ్ళండి. మేమీ ఇంటిని దగ్ధం చెయ్యాలి!" అన్నాడు మందహాసుడు. అతను ఆ మాట అన్నదే తడవుగా ఇంటిని తగలబెట్టటానికి భటులు దివిటీలతోసహా పరిగెత్తారు.

మందహాసుడు నీలాలకను గుర్తించాడు. అతని మనస్సు కలవరపడింది. అతను నీలాలక కొడుకును ఎత్తుకుని ముద్దుపెట్టు కుని తల్లికి అప్పగించాడు. తరవాత చప్పట్లు చరిచి తన భటులను పిలిచి, "ఒరే, ద్రోహి దక్షిణంగా పారిపోయాడు. మీరు వెంటనే వాణ్ణి పట్టుకోండి. నేను ఈమెను ఎవరింట నన్నా వదిలిపెట్టి మీ వెనకటితే వస్తు న్నాను!" అన్నాడు.

మందహాసుడి భటులు దక్షిణంగా బయలుదేరి వెళ్లారు. తరవాత మంద హాసుడు తగలబడుతున్న ఇంట్లో ప్రవేశించి,



మంచంలో అసహాయస్థితిలో ఉన్న ధృత వర్మను చేతుల్లో ఎత్తి బయటికి తెచ్చాడు; తన గుర్రంమీద పడుకోబెట్టి తాను పక్కన నడుస్తూ ఉత్తరంగా బయలుదేరాడు. నీలాలక తన కొడుకు నెత్తుకుని వెంట నడిచింది.

తెల్లవారేసరికి వారు సరిహద్దు దాటారు. సరిహద్దు అవతల ఒక కాపుల ఇంట్లో ధృత వర్మా, అతని భార్యా పుత్రులూ కొద్ది రోజులు ఉండటానికి ఏర్పాటు చేసి మంద హాసుడు తన గుర్రంమీద కైలాసవతీ నగరానికి తిరిగి వచ్చాడు. అతను నేరుగా సేనాని వద్దకువెళ్లి, "రాజద్రోహిని కాపాడిన వాడికి శిక్ష ఏమిటి?" అని అడిగాడు.

"శిరచ్ఛేదం!" అన్నాడు సేనాని.

"అయితే నాకు శిరచ్ఛేదం చేయించండి. రాజుగారిపైన తిరుగుబాటు చేసిన ధృతవర్మను నేను కాపాడి, సరిహద్దు దాటించి ఇప్పుడే వస్తున్నాను!" అన్నాడు.

సేనాని ఆశ్చర్యంతో, "చేసిందేదో చేశావు! ఆ సంగతి ఒకరికి చెప్పటం దేనికి? నిన్ను ఎవరు అడగబోయారూ?" అన్నాడు.

మందహాసుడు తృప్తిచెందక రాజుగారి వద్దకు వెళ్లి, "మహారాజా, నేను రాజద్రోహి అయిన ధృతవర్మను కాపాడాను. నాకు తగిన శిక్ష విధించండి," అన్నాడు.



రాజుగారు మండిపడి తన మంత్రితో, "ఈ దుర్మార్గుడి తల తీయించండి!" అన్నాడు. సేనాని అడ్డుపడి, "మహారాజా, తొందరపడకండి. మన సామంతులలో ఎంతోమంది యుద్ధానికి రాకుండా ఏవో సాకులు చెప్పి తప్పించుకున్నారు. ఇతను తిరుగుబాటుదార్లతో వీరోచితంగా పోరాడాడు. యుద్ధం ముగిసినాక ఇరవైమందికి పైగా రాజద్రోహులను పట్టుకున్నాడు. ఒక్కణ్ణి కాపాడినంతమాత్రంచేత రాజద్రోహిగా ఎంచి మరణదండన విధించటం భావ్యం కాదు. తాను చేసిన తప్పు తానే బయట పెట్టుకోవటంలో ఇతని రాజభక్తి మరింత

స్పష్టమవుతున్నదిగదా!" అన్నాడు. సేనాని చేసిన ఈ వాదన రాజుకు నచ్చింది. ఆయన మందహాసుణ్ణి దండించక విడిచిపుచ్చాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మంద హాసుడి ప్రేమ అనన్యమైనది. అతని రాజ భక్తికూడా అపారమైనదే. ఈ రెండిటి సంఘర్షణలో ప్రేమ జయించిందనీ, అందుకే అతను ధృతవర్మను విడిచిపుచ్చా డనీ అనుకోవచ్చు. అయితే అతను ఆ పని చేసినందుకు తన ప్రాణాలు అర్పించటానికి కూడా సిద్ధపడ్డాడు గనక, అతని ప్రేమ గొప్పదో, రాజభక్తి గొప్పదో నేను నిర్ణయించ లేకుండా ఉన్నాను. తెలిసికూడా నా సందేహం తీర్చలేనిపక్షంలో నీ శిరస్సు పగిలి పోతుంది!" అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మందహాసుడి ప్రేమలోగాని, రాజభక్తిలోగాని విశిష్టత ఏమీ లేదు. అతను నిజంగా నీలాలకను ప్రేమించినవాడైతే ఆమె ప్రేమకు పాత్రుడైనవాణ్ణి చంపటానికి ఘోరప్రతిజ్ఞ చెయ్యడు. అతని రాజభక్తికూడా అంతంత మాత్రమే. యుద్ధరంగంలో ధృతవర్మను చంపే అవకాశంకోసమే అతను రాజుపక్షాన చేరాడు. ఒకవేళ ధృతవర్మ రాజుపక్షాన చేరిఉంటే మందహాసుడు తిరుగుబాటు దార్లవేపు చేరేవాడే. మందహాసుడిలో ఉన్నది ఆత్మాభిమానం. నీలాలక తనను ప్రేమించక ధృతవర్మను ప్రేమించేసరికి అతని ఆత్మాభి మానం దెబ్బతిన్నది. అందుకే ధృతవర్మను చంపుతానని ప్రతిజ్ఞ చేశాడు. నీలాలక దృష్టిలో నీచుడుగా కనపడటం ఇష్టంలేకనే ధృతవర్మ ప్రాణాన్ని కాపాడాడు. కాని దెబ్బతిన్న తన ఆత్మాభిమానానికి తగిన ప్రతిక్రియ జరగనందువల్ల తనకు తానే బలి కావటానికి యత్నించాడు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)



# మీకు తెలుసా?

రైలుమార్గంవెంబడి పట్టాలు వేయటానికి ఇప్పుడొక యంత్రాన్ని వాడుతున్నారు. అది పట్టాలువేస్తూ, తాను వేసిన పట్టాలపైనే ముందుకు సాగిపోతుంది.

*　　　*　　　*

అమెరికాలో బొగ్గు వాడే రైలుఇంజన్లు లేవు. ఇప్పుడు రష్యాలోకూడా అటువంటి రైలు ఇంజన్లను నిర్మించటం మానేశారు. వాటికి బదులు చమురుతో నడిచే డీజెల్ ఇంజన్లూ, విద్యుచ్ఛక్తితో నడిచే ఇంజన్లూ నిర్మిస్తారు.

*　　　*　　　*

"క్షణం" అన్న కాల విభాగానికి ప్రమాణం నిర్ణయించటం సాధ్యంకాదు. సినిమా తెర పైన సెకండుకు ఇరవైనాలుగు చొప్పున నిశ్చలమైన బొమ్మలు పడతాయి. కాని మన కన్ను "కదిలే" బొమ్మలనె చూస్తుంది. ఒక సెకండులో 500 వంతు కాలంలో జరిగే సంఘటనను ఫొటో తీయగల కామెరాలు బజార్లలో అమ్ముతున్నాయి. టెన్నిస్ ఆటలో "సర్వీస్" మొదలైన వివరాలు ఈ కామెరా "చూడ" గలుగుతుంది. సెకండులో 10 వేలు మొదలు 10 లక్షల వంతు కాలంలో బొమ్మ తీయగల ప్రత్యేక కామెరాలతో పక్షులు ఎగిరేటప్పుడూ, ఎలెక్ట్రిక్ బల్బులు పగిలేటప్పుడూ, కొళాయినుంచి నీరు కారేటప్పుడూ ఏమి జరిగేదీ చూడగలిగారు. ప్రస్తుతం రష్యాలో నడిచే ఎగ్జిబిషన్‌లో సెకండుకు 3,20,00,000 దృశ్యాలను "చూడ"గల యంత్రం ప్రదర్శించబడుతున్నది!

*　　　*　　　*

ప్రస్తుతం రష్యా, అమెరికాలవారు ఆకాశంలోకి పంపే కృత్రిమ ఉపగ్రహాలలో టెలివిజన్‌ను రిలే చేసే యంత్రాన్ని ఉంచినట్టయితే దాని సహాయంతో భూమిమీద ఉన్న వారంతా టెలివిజన్ కార్యక్రమాలన్నిటినీ చూసేటందుకు సదుపాయంగా ఉంటుంది. ప్రస్తుతం అలాటి సౌకర్యం లేకుండా ఉన్నది.

*　　　*　　　*

కొద్దికాలంక్రితం ఇటలీలోని ఒక బొగ్గుగనిలో 600 అడుగుల లోతున ఒక పురాతన మానవ అస్థిపంజరం 'ఫాసిల్' రూపంలో దొరికింది. ఇది కోటి సంవత్సరాలక్రితం జీవించిన మానవుడిదని శాస్త్రవేత్తలు అంచనావేశారు. మానవులు నరవానరాలనుంచి పరిణామం చెందలేదనీ, 6 లేక 7 కోట్ల సంవత్సరాలక్రితం జీవించిన ఒక రకం మృగాలనుంచి మానవులూ, నరవానరాలూ కూడా పరిణామం చెందటం జరిగిందనీ ఈ అస్థిపంజరం నిరూపిస్తున్నదని అంటున్నారు. ఈ అస్థిపంజరం నిడివి నాలుగడుగులు మాత్రమే. ఇది పరిణామదశలో ఉన్న మానవుడిది.



# మంచు మనిషి - "యతి"

హిమాలయ పర్వతాలలో ఒక మనిషిలాటి మృగం ఉన్నది. దానిని ఆ ప్రాంతాలలోవాళ్ళు యతి అనీ, మేతి అనీ, మూక్పా అనీ, మిగో అనీ, కాంగ్మి అనీ వేరువేరు పేర్లతో పిలుస్తారు. అయితే చాలా కాలం పాశ్చాత్య విజ్ఞానవేత్తలు ఇలాటి మృగం ఉందనికూడా నమ్మలేదు.

"యతి" గురించి మొదటగా అనుభవం పొందిన పాశ్చాత్యుడు కర్నల్ వాడెల్ అనే బ్రిటిషు పర్వతారోహకుడు. ఈయన 1887 లో సిక్కిమ్‌లో 16 వేల అడుగుల ఎత్తున మంచుభూమిలో నడుస్తూ ఒక అడుగుల జాడ చూశాడు. ఆ అడుగులు మనిషి అడుగులలాగే ఉన్నాయి కాని చాలా పెద్దవి. ఏ మనిషిగాని పాదరక్షలు లేకుండా ఉత్త కాళ్ళతో ఆ మంచులో ఒంటరిగా నడిచిపోవడం వాడెల్‌కు ఆశ్చర్యం కలిగించింది.

1906 లో హెన్రీ ఎల్విస్ అనే ఆయన "యతి" అడుగుజాడలు మాత్రమే గాక పారిపోతున్న "యతి"ని కళ్ళారా చూశాడు. "యతి" శరీరంనిండా బొచ్చు ఉన్నది. ఈయన తన అనుభవాన్ని కొద్దిమంది మిత్రులకు మాత్రమే చెప్పాడు.

1921 లో ఎవరెస్టు శిఖరాన్ని జయించటానికి తొలి ప్రయత్నం చేసిన లెఫ్టినెంట్ కర్నల్ సి. కె. హొవర్డ్ - బ్యూరీ హిమాలయ పర్వతాల పైనుంచి కింద ఉన్న మంచు లోయలోకి చూడగా ఒక మనిషిలాటి ఆకారం, శరీరంనిండా రోమాలు కలిగి మంచుమీదుగా తాపీగా రెండు కాళ్ళమీద నడిచి పోవటం కనబడింది. అది మనిషి కాదనీ, "యతి" అనీ, అది కొండగొర్రెలనూ, ఒకొక్కప్పుడు గొర్రెలను కాసేవాళ్ళనూ కూడా చంపేస్తుందనీ ఆయన వెంట ఉన్న షెర్పా పోర్టర్లు చెప్పారు. షెర్పాలు "యతి"ని కాంగ్మి అంటారు.

హిమాలయ శిఖరారోహకుల సంఖ్య జాస్తి అవుతున్నకొద్దీ పాశ్చాత్యులకు "యతి" గురించి సాక్ష్యంకూడా పెరిగింది. కొందరు కథలు కల్పించి చెప్పినప్పటికీ అనేక డజన్లమంది ప్రతిష్ఠ గల పర్వతారోహకులు చెప్పిన విషయాలను కొట్టి పారవెయ్యటం ప్రపంచానికి సాధ్యంకాలేదు.

1922 లో కొందరు బ్రిటిషు సైనికోద్యోగులు సిక్కిమ్‌లో అనేక "యతు"లను ఒక్కసారిగా చూశారు. అవి మనుషులలాగే కాళ్ళమీద పరి

గెత్తుతూ ఒక అడవిలోకి వెళ్ళిపోయాయి. మర్నాడు ఉదయం అవి పరిగెత్తిన ప్రాంతంలో మంచులో మనుషుల అడుగుజాడలలాటివి కనిపించాయి.

నేపాల్‌లో ఒక ప్రాంతంలో 16 వేల అడుగుల ఎత్తున రొనాల్డ్ కొల్బాక్ అనే బ్రిటిష వృక్షశాస్త్ర వేత్తకు 1936 లో ఇలాటి అడుగుజాడలే కనిపించాయి. మరుసటి ఏడు నేపాల్‌లోని ఒక లోయకు ఉత్తరాన ఫ్రాంక్ స్మిత్ అనే ఆయన "యతి" అడుగుజాడలు చూసి వాటినిబట్టి కొంతదూరం వెళ్ళాడు. దాదాపు ఇదే తరుణంలో కాప్టెన్ (ఇప్పుడు సర్) జాన్ హంట్ సిక్కిమ్‌లోని ఒక లోయలో "యతి" అడుగు జాడలు చూశాడు.

తరవాత 1948 లో ఇద్దరు నార్వేజియనులు "యతి" అడుగుజాడలను అనుసరించి పోతూ రెండు "యతు"లను ఎదుర్కొన్నారు. వాటి శరీరాల నిండా బొచ్చున్నది. వారు ఒక "యతి"ని ఉచ్చువేసి పట్ట ప్రయత్నించారు, కాని అది వారిలో ఒకడిపై బడి భుజం కొరేసింది. రెండవవాడు తుపాకి తీసి భయపెట్టగా అది పారిపోయింది.

1951 దాకా "యతి"ని గురించిన కథలు నోటి మాటలుగానే ఉంటూ వచ్చాయి. కాని ఆ యేడు ఎరిక్ షిప్టన్ అనే ఆయన "యతి" అడుగుజాడలను ఫొటోలు తీసి, "యతులు" ద్విపాత్తులని నిరూపించాడు. అవి ఒక కందకం మీదుగా దూకేటప్పుడు అవతలివేపున ఒంటికాలి పైన దూకాయి. ఇది నాలుగుకాళ్ళ జంతువులకు సాధ్యంకాదు. షిప్టన్ ప్రకటించిన ఫొటోలనుబట్టి "యతి" మనిషిలాటిదేననీ, మామూలు మనిషి మాత్రం కాదనీ ప్రపంచానికి స్పష్టమయింది.

అటుతరవాత "యతి" అడుగుజాడలు చూసిన వారిలో ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కిన ఎడ్మండ్ హిలరీ కూడా ఉన్నాడు. "యతి" అడుగు గుర్తులలో 13 అంగుళాల నిడివి ఉన్నవి కూడా ఉన్నాయి! హిమాలయ ప్రాంతాలలో "యతి"ని చూసినవాళ్ళు చాలామంది ఉన్నారు. వారికి ఒక గొరిల్లా బొమ్మా, ఉరాంగుటాన్ బొమ్మా, పురాతన మానవుడి చిత్రమూ చూపిస్తే వారు "యతి" గొరిల్లానే పోలిఉన్నట్టు చెప్పారు.

మనిషికీ వానరాలకూ మధ్యగా వున్న ఈ "యతి"ని ఇప్పుడు శాస్త్రవేత్తలు వేటాడుతున్నారు. ఈ వేటలో రష్యనులూ, బ్రిటిషువారూ, అమెరికనులూ, స్విట్జర్లాండువారూ కూడా వున్నారు. వీరిద్వారా మనకు త్వరలోనే "యతి" గురించి అనేక విషయాలు తెలుస్తాయనుకోవచ్చు.





# అంటార్కిటికా మీదుగా ప్రయాణం



దక్షిణధ్రువం ఉండేచోట ఒక ఖండం ఉన్నదనీ, దాని పేరు అంటార్కిటికా అనీ మీకు ఇదివరకే తెలుసును. ఆ ఖండంపైన విమానాలలో ఎగిరిన బర్డ్ ప్రభృతులను గురించీ, దక్షిణధ్రువాన ఒక దీర్ఘరాత్రి గడిపిన డాక్టర్ సిపిల్ ప్రభృతులనుగురించీ మీరు లోగడ చదివిఉన్నారు. ఈసారి ఇంకా సాహసోపేతమైన విషయాలు చదువుతారు.

డాక్టర్ వివియన్ ఫూక్స్ అనే బ్రిటిష్ పరిశోధకుని నాయకత్వంకింద ఒక కామన్వెల్తు దళం 1957 ఆఖరులో అంటార్కిటికా ఖండాన్ని ఒక చివరనుంచి మరొక చివరకు నేలమార్గాన దాటింది. వీరు వెడెల్ సముద్రతీరాన గల షాకిల్టన్ స్థావరంనుంచి 1957 నవంబరు 24 న బయలుదేరి, 1958 జనవరి 20 న దక్షిణధ్రువాన్ని చేరి, తిరిగి అక్కడినుంచి ప్రయాణం సాగించి రాస్ సముద్రంతాలూకు మక్‌మర్డోతీరాన గల స్కాట్ స్థావరాన్ని మార్చి 2 నాటికి చేరుకున్నారు. (వారు నడిచిన మార్గం పైన ఉన్న పటంలో చూపబడి వున్నది.) ఈ ప్రయాణంలో అనేక శాస్త్రపరిశోధనలుకూడా జరిగాయి. ఈ పని విజయవంతంగా సాగించినందుకు వివియన్ ఫూక్స్‌కు "సర్" బిరుదుకూడా లభించింది.

డాక్టర్ ఫూక్స్ భూతత్వశాస్త్రవేత్త. ఆయన ఆఫ్రికాలోనూ, ఉత్తర, దక్షిణధ్రువ ప్రాంతాలలోనూ ఇదివరకు పర్యటించినవాడే. దక్షిణధ్రువంమీదుగా అంటార్కిటికాను ఒక చివరనుంచి మరొక చివరకు దాటాలన్న ఆలోచన ఆయనకు మొదటగా 1950 లో, అంటార్కిటికాలో పర్యటించు తున్నప్పుడే కలిగింది.

అయితే ఆ ఆలోచన వెంటనే సఫలం కాలేదు. 1953 లో అధికారులు ఆయనను



ఈ ప్రయాణానికిగాను ఒక పథకం తయారు చెయ్యమన్నారు. ఆయన ఈవిధంగా పథకం వేశాడు: ఈ నేలప్రయాణం వెడెల్ సముద్ర తీరంనుంచి ధ్రువంమీదుగా మక్మర్డో తీరందాకా జరగాలి. ఇందుకుగాను ట్రాక్టరు వాహనాలు ఉపయోగించాలి. ప్రయాణానికి కుక్కలూ, విమానాలూ, సహాయపడాలి. ధ్రువానికి అవతలివేపున అక్కడక్కడా ఆహారమూ, పెట్రోలూ విమానాల సహాయంతో దారివెంబడి ఉంచినట్టయితే ప్రయాణానికి అవసరమైన ఆహారమూ, పెట్రోలూ వెంటబెట్టుకుని బయలుదేరే అవసరం తప్పుతుంది. వెడెల్ సముద్రతీరానికి కొంత దూరంలో ముందుగానే ఒక స్థావరం ఏర్పాటుచేసి, ఒక శీతాకాలమంతా అక్కడ మనుషులను ఉంచి వాతావరణ పరిశీలనలూ, మంచునుగురించి పరిశీలనలూ చేయించాలి. ప్రయాణానికి అవసరమయే సంబారాలన్నీ ఇక్కడినుంచే తీసుకుపోవాలి. దారిపొడుగునా మంచుపొర ఎంత మందంగా ఉన్నదీ ప్రయాణంలో పరిశీలించబడుతుంది.

పథకం తయారయింది, ఆర్థికసహాయం కావాలి. ఇదికూడా లభించింది. బ్రిటిషు, న్యూజీలాండు, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా



ప్రభుత్వాలూ, అనేక సంస్థలూ, పరిశ్రమలూ, విద్యాసంస్థలూ, సాధారణ ప్రజలూకూడా ధనసహాయం చేశారు. న్యూజీలాండు ప్రభుత్వం అదనంగా చేసిన సహాయ మేమంటే, మక్మర్డో తీరంనుంచి దక్షిణధ్రువందాకా ఉండే దారిలో ఆహారమూ ఇతర సంబారాలూ అక్కడక్కడా అమర్చే పనికి సర్ ఎడ్మండ్ హిలరీని నియోగించింది. (టెన్సింగుతోబాటు ఈ హిలరీ ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కిన అనంతరం ఈయనకు ప్రపంచ ఖ్యాతి లభించింది.)

1955 నవంబరుమాసం మధ్యలో ఫూక్స్ బృందంవారు నౌకలో బయలుదేరి వెడెల్





సముద్రతీరానికి వచ్చారు. 1956 జనవరి 30 న నౌక వాసెల్ సింధుశాఖలో లంగరు దించింది. తీరానికి ఒక మైలు దూరంలో ఒక స్థావరం ఏర్పాటుచేసుకుని దానికి షాకిల్టన్ స్థావరం అని పేరుపెట్టారు. (1914 లో ఎర్నెస్ట్ షాకిల్టన్ అనే ఆయన వీరిలాగే ఈ ఖండాన్ని ఇటునుంచి అటు తరించటానికి బయలుదేరాడు.)

ఇప్పుడీ దళంలో ఎనిమిదిమంది మాత్రమే. వీరు శీతాకాలమంతా ఇక్కడ గడపటానికిగాను కుటీరం నిర్మించాలి, సముద్రం వీక్షణాన పేరుకుపోయినా పేరుకు పోవచ్చు. అలా జరిగితే వారిని తెచ్చిన నౌక తిరుగుప్రయాణం చేయలేదు. అందుచేత దానిని పంపేశారు. ఆ నౌకలో వచ్చిన ఒక ట్రాక్టరు ("మంచుపిల్లి") పెద్ద చెక్కల పెట్టెలో వచ్చింది. దాని నిడివి 20 అడుగులు, వెడల్పు 9 అడుగులు, ఎత్తు 8 అడుగులు. కుటీరం తయారయేదాకా దాన్నే ఆశ్రయంగా ఉపయోగించుకోవటానికి నిశ్చయించారు. అయితే మంచు తుఫానులు తీవ్రం కావటంమూలాన కుటీరం నిర్మాణం కానేలేదు. అందుచేత ఆ ఎనిమిదిమందీ శీతాకాలం ఆరునెలలపాటూ నిద్రపోవటానికి గుడారాలను ఉపయోగిస్తూ మేలుకుని వున్నప్పుడు ఈ చెక్కపెట్టెలో వుంటూవచ్చారు. (షాకిల్టన్ స్థావరం దక్షిణధ్రువానికి 900 మైళ్ళు దూరంగా వున్నది గనక ఇక్కడ ఆరు నెలలూ దీర్ఘరాత్రిగా వుండదు.)

శీతాకాలం గడిచి వసంతం రాగానే వీరు కుటీరాన్ని నిర్మించి, ధ్రువానికేసి వెళ్లటానికి మార్గం ఎటుగా వుంటే వీలుగా వుంటుందో తిరిగి అన్వేషించారు. ఈలోపుగా ఇంకొక నౌక మరికొందరు మనుషులనూ, ట్రాక్టర్లనూ, సంబారాలనూ తెచ్చి దించింది. వీరంతా మరొక శీతాకాలం ఇక్కడ గడిపి ప్రయాణానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చూస్తారన్నమాట.





శాస్త్రపరిశీలనలు సాగించటానికీ, ప్రయాణానికి అవసరమైన సామగ్రి యావత్తూ నిలవ వుంచటానికీ ఒక పెద్ద స్థావరాన్ని తీరానికి 300 మైళ్ళ దూరంలో ఏర్పాటుచేశారు. విమానాల సహాయంతో ఈపని అతి చురుకుగా సాగింది. ఈ స్థావరానికి "సౌత్ ఐస్" (దక్షిణపు మంచు) అని పేరుపెట్టారు. విమానాలు ఈ స్థావరానికి చాలా ప్రయాణాలు చేశాయి. ఈ ప్రాంతాన్ని వీరు వివరంగా పరిశీలించి పేర్లుకూడా పెట్టారు.

థెరాన్ కొండలలో బొగ్గునిక్షేపాలు కనిపించాయి. అక్కడి రాళ్లలో పురాతనపు మొక్కల "ఫాసిల్" రూపాలు కనిపించాయి. 20 కోట్ల ఏళ్లక్రితం ఈ ప్రాంతంలో ఉష్ణమండలంలో పెరిగే చెట్లుండేవి!

రెండవసారి మనుషులను తెచ్చిన నౌక తిరిగి వెళ్లిపోయింది. ఇక వారికోసం ఏనౌకా రాదు. నిర్జనమైన అంటార్కిటికా ఖండంలో ఆ మనుషులు ఇక తమ దారి తాము చూసుకోవలిసిందే. వారికి వున్నది ఒకటే దారి, 2 వేల మైళ్ళు మంచు ఎడారిని తరించి రాస్ సముద్రతీరాన్ని చేరుకోవటం!

ఇప్పుడు షాకిల్టన్ స్థావరంలో 16 మంది మనుషులున్నారు, కాని చేయవలసిన పని చాలా ఉన్నది. మరొక శీతాకాలం ముగిసింది. 1957 అగస్టు అంతంలో తిరిగి సూర్యదర్శనమయింది. (దక్షిణధ్రువాన ఉండే వారికి సూర్యదర్శనం మరొక మాసానికి గాని కాదు).

ఫూక్స్‌బృందం సౌత్ ఐస్ స్థావరానికి అక్టోబరు 8 న మార్గాన్వేషణకై బయలుదేరింది. అయితే కొందరు మనుషులూ, కుక్కలూ విమానాలలో ముందుగా షాకిల్టన్ పర్వతప్రాంతంలో దించబడ్డారు. షాకిల్టన్ స్థావరంనుంచి బయలుదేరినవారిలో ఫూక్స్ కాక మరి ముగ్గురున్నారు; వారివెంట మూడు 'వీజెల్' ట్రాక్టర్లూ, ఒక "మంచు పిల్లి" ట్రాక్టరూ ఉన్నాయి.



వీరు వెళ్లేమార్గం అతి ప్రమాదకరమైనది. ఎందుచేతనంటే ఈ ప్రాంతపు భూమిలో పెద్దపెద్ద నెర్రెలూ, అగాధాలూ ఉన్నాయి. వాటిపైన మంచు కప్పి ఉన్నది. మంచు మందంగానూ, బిగువుగానూ ఉన్నట్టయితే ట్రాక్టరు వాహనాలు ఆ మంచు "వంతెనల" పైగా వెళ్లగలవు. కాని సూర్యోదయమై కొంతకాలం అయి ఉండటంచేత మంచు "వంతెన"లు దుర్బలమై కూలిపోవటానికి సిద్ధంగా ఉన్నాయి. భూగర్భంనుంచి భయంకరమైన పేలుడు ధ్వనులూ, కార్ఖానా మోతలూ వినవస్తున్నాయి.

ఈ పరిస్థితిలో ఏక్షణాన ఏ వాహనం కింది మంచు విరిగినా విరిగి, వాహనం అగాధంలో పడిపోవచ్చు. అందుచేత వాహనాలన్నిటిమధ్యా కట్టుతాళ్లు ఏర్పాటుచేశారు. అవసరమని తోచినప్పుడు మనుషులు దిగి దారిని ఆరేసి అడుగుల అల్యూమినం గొట్టాలతో పొడిచి చూశారు. మంచు ఆపాటి మందం ఉన్నట్టయితే, దాని అడుగున పెద్ద కందకం ఉన్నా ఫరవాలేదు. వాహనాలు క్షేమంగా వెళ్లవచ్చు.

దారిలో కందకాలున్నదీ లేనిదీ తెలుసుకునేటందుకు వారు మంచును తట్టి చూసేవారు. మంచు "బోలు"గా మోగిందంటే కింద గొయ్యి ఉన్నదన్నమాట. అప్పుడు వారు దానిలో తల దూరేపాటి కంతలు చేసి, తలలు దూర్చి కందకం ఏవైపునుంచి ఏవైపుగా పరుచుకుని ఉన్నదీ జాగ్రత్తగా గమనించేవారు.

ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ, విమానాలు అవసరమైన సహాయమంతా చేస్తున్నప్పటికీ "సౌత్ ఐస్"ను చేరుకున్నవి రెండు వాహనాలే. అక్కడికి చేరటానికి 37 రోజులూ, 400 మైళ్ల ప్రయాణమూ పట్టింది! కాని వారు రెండున్నర గంటలలో విమానం మీద తమ స్థావరానికి తిరిగి చేరుకోగలిగారు. —(ఇంకా వుంది)






## 10

త్వరలోనే విశాఖకు తన మామగారితో ఘర్షణ వచ్చింది.

మిగారుడు నిఘంటుడనే తీర్థకస్వామి శిష్యుడు. ఒకనాడాయన తన కోడలితో, "పూజకు పోదాం, సిద్ధం కా!" అన్నాడు. విశాఖ ఉత్సాహంతో మంచి దుస్తులు ధరించి, నగలు పెట్టుకుని మామగారివెంట బయలుదేరింది. కాని తాము పూజించ బోతున్నది దిగంబరస్వాములనని తెలియ గానే అమె అసహ్యపడుతూ, "నన్ను ఇలాటి చోటికి తెచ్చారేమిటి?" అన్నది.

తీర్థకులు ఆగ్రహించి, "చూశావా, నీ కొడుకుకు ఎలాటి భార్యను తెచ్చుకున్నావో? ఇది బుద్ధుణ్ణి అనుసరించే పాపి! ఇది నీ కొంపకు నాశనం తెస్తుంది. దీన్ని వెంటనే వెళ్లగొట్టించు!" అన్నారు.

"అది చిన్నపిల్ల! క్షమించండి!" అన్నాడు మిగారుడు తీర్థకులతో.

మరొకనాడు మిగారుడి ఇంటికి భిక్షాపాత్ర పట్టుకుని ఒక అర్హతుడు వచ్చాడు. విశాఖ ఆయనతో, "స్వామీ, ఈ ఇంటి యజమాని ఎంగిలి కూడు తింటాడు. మీరు మరొక ఇంటికి వెళ్లండి!" అన్నది.

ఈ మాటలు మిగారుడు విన్నాడు. ఆయన కోపించి తన కోడలితో, "నువు నా యింటినుంచి వెళ్లిపో," అన్నాడు.

"పొమ్మంటే పోవటానికీ, రమ్మంటే రావటానికీ, నేను మీ దాసీదాన్ని కాను.




నావెంట మా నాన్న ఎనిమిదిమంది రక్షకులను పంపాడు. వారిని పిలిపించండి," అన్నది విశాఖ.

రక్షకులు వచ్చారు. మిగారుడు వారితో, "మా కోడలు నన్నుగురించి చాలా అవమానకరంగా మాట్లాడింది," అన్నాడు.

"మా మామగారు ఎంగిలి కూడు తింటాడని అన్నాను. నా ఉద్దేశం జన్మపరంపరలలో చేసుకున్న కర్మ అనుభవిస్తున్నాడని!" అని విశాఖ వివరించింది. ఈ మాటలు విని మిగారుడు శాంతించి, తృప్తిపడ్డాడు.

"ఇదేనా, లేక నావల్ల ఇంకేమైనా అపచారాలు జరిగాయా?" అని విశాఖ అడి



గింది. ఇంకేమీ జరగలేదని మిగారుడు ఒప్పుకున్నాడు.

"సరే, నా దాసదాసీలను పిలిపించండి. నేనీ ఇంట ఉండదలచలేదు, వెళ్లి పోతున్నాను," అన్నది విశాఖ.

"వెళ్లిపోకు. మా ఇంటనే ఉండు!" అని మిగారుడు కోడలిని బతిమాలాడు.

"మీరు నాస్తికులు, నేను బుద్ధుడి శిష్యురాలిని. బుద్ధుడి ఉపదేశాలు వినే హక్కు నాకు ఉన్నట్టయితేనే నేనీ ఇంట ఉంటాను!" అన్నది విశాఖ.

మిగారు డిందుకు ఒప్పుకున్నాడు. ఇది జరిగిన కొద్ది రోజులకే విశాఖ బుద్ధుణ్ణి, ఆయన అనుచరులనూ తమ ఇంటికి భిక్షకు ఆహ్వానించింది. ఈ సంగతి తీర్థకులకు తెలిసింది. మిగారుడు ఒకసారి బుద్ధుడి దర్శనం చేసుకున్నాడంటే ఇక తమకేసి చూడడని వారు భయపడ్డారు. వారు మిగారుడితో, "బుద్ధుడు మీ ఇంటికి భోజనానికి వచ్చినప్పుడు నీవు ఇంట వుండక ఎక్కడైనా వెళ్లిపో!" అని సలహా ఇచ్చారు.

"నేను మీ సలహా వినను నా కోడలు విశాఖ చాలా బుద్ధిమంతురాలు. ఆమె సలహాప్రకారమే చేస్తాను," అన్నాడు మిగారుడు.





"నీకు కొంచెంకూడా జ్ఞానం లేదు. ఆ బుద్ధుడికేసి చూశావంటే నరకానికి పోతావు. కావలిస్తే వాడి బోధలు విను, కాని వాడు నీ కళ్ళ పడకుండా కళ్ళకు గంత కట్టుకో!" అన్నారు తీర్థకులు.

వారి సలహాప్రకారమే మిగారుడు తన కోడలివెంట బుద్ధుడివద్దకు వెళుతూ కళ్లకు గంత కట్టుకున్నాడు. కాని బుద్ధుడి మాటలు వింటూంటే కలిగిన ఆనందంతో ఆయన తన కళ్ళకు అడ్డంగా వున్న గంత లాగి పారేసి, బుద్ధుడి దివ్యమైన రూపాన్ని చూశాడు. ఆయన విశాఖకేసి తిరిగి, "అమ్మా, ఇకనుంచీ నీవు నన్ను నీ కొడుకు లాగా చూసుకుని నన్ను కాపాడుతూ వుండు!" అన్నాడు. ఆయన బుద్ధుణ్ణి సమీపించి, "స్వామీ, నాకిక మీరే దిక్కు. నాకున్న నలభై కోట్లూ మీకే కైంకర్యం చేస్తాను. బుద్ధుడికి సమర్పించినది ఏదీ వ్యర్థం కాదు. ఈనాడు నాకు సుదినం!" అన్నాడు. అది మొదలు మిగారుడి ఇంట బౌద్ధులకు తప్ప మరే మతంవారికీ స్థానం లేకుండా పోయింది. మిగారుడి బుద్ధిని మార్చటంవల్ల విశాఖను అందరూ "మిగార మాత" అని పిలిచారు. బుద్ధుడి వెంటవుండే శిష్యురాళ్ల కందరికీ విశాఖ పెద్ద అయింది.




విశాఖ రోజుకు మూడుసార్లు విహారానికి వెళ్లి వచ్చేది. ఉదయంపూట భోజనాలు తీసుకుపోయేది, సాయంకాలంపూట పూలూ, దీపాలూ తీసుకుపోయేది. బుద్ధుడు స్త్రీలకు వరాలివ్వరాదనే నియమం గలవాడు. అయినప్పటికీ, బౌద్ధమతాభివృద్ధికోసమని ఆయన విశాఖ కోరికలను ఆమోదించాడు. ఆమె ఆయనను ఎనిమిది వరాలు కోరింది. వాటిలో బుద్ధుడివద్దకు కొత్తగా వచ్చేవారిని ఆమె ఇంటికి పంపటమూ, ఆమె జీవితాంతం వరకూ ప్రతిరోజూ అయిదువందలమంది బౌద్ధ సన్యాసులు ఆమె ఇంట భోజనం చెయ్యటమూ, జబ్బుపడినవారు ఆమెవల్ల



సహాయం పొందటమూ, ఏటా అయిదు వందలమంది సన్యాసులు ఆమెనుంచి తమకు కావలిసిన వస్త్రాలూ, పరికరాలూ స్వీకరించటమూ మొదలైనవి ఉన్నాయి.

విశాఖ ఇరవైఏళ్ల కాలంలో ఇరవైమంది పిల్లలను కన్నది. వారిలో పదిమంది కొడుకులు, పదిమంది కూతుళ్లు. ఇంత మంది పిల్లలను కన్నప్పటికీ ఆమె శరీరం చాలా దృఢంగా ఉండేది. ఆమెకు అయిదు ఏనుగుల బలం ఉన్నదని విని శ్రావస్తి రాజు నమ్మలేకపోయాడు. ఒక సమయంలో ఆమెకు ఎదురువస్తూ అయన తన ఏనుగును ఆమెపైకి నడిపించాడట. ఆమె ఒక



చేతితో ఆ ఏనుగు తొండాన్ని పట్టుకుని నొక్కేసరికి, అది బాధతో ఘీంకరించిందట.

కొంతకాలం గడిచాక విశాఖ తనకు తండ్రి పెట్టిన నగలన్నిటినీ అమ్మేసి ఆ సొమ్ముతో బౌద్ధవిహారం ఒకటి కట్టాలని నిశ్చయించింది. కాని ఆ నగలను కొనగలిగిన ధనికుడు శ్రావస్తిలో లేకపోయాడు. అయినప్పటికీ ఆమె నగరానికి తూర్పువేపున వున్న ఒకతోట కొని, ఎంతో డబ్బు వెచ్చించి అక్కడ ఒక విహారం నిర్మించింది. తూర్పుగా వుండటంచేత దానికి పూర్వారామమన్నపేరు వచ్చింది. విశాఖ ఈ విహారాన్ని బుద్ధుడిపరం చేసిననాడు బుద్ధుడు, "విశాఖకు గల సంపదా, బలమూ, సౌభాగ్యమూ ఆమె పూర్వజన్మలలో చేసుకున్న సత్కర్మల ఫలితంగా కలిగాయి!" అని చెప్పాడు.

* * *

శుద్ధోదనుడికి అమితోదనుడని ఒక తమ్ముడున్నాడు. అయనకు మహానముడూ, అనురుద్ధుడూ అని ఇద్దరు కొడుకులూ, రోహిణి అని ఒక కూతురూ ఉన్నారు. అనురుద్ధుడు బొత్తిగా ప్రపంచజ్ఞానం లేనివాడు.

వాడు ఏడేళ్లవాడై ఉండగా ఒకనాడు మరి ఇద్దరు రాజకుమారులతో ఏదో ఆట ఆడాడు. ఆ ఆటలో ఓడినవారు మిగిలిన





వారికి బియ్యపు రొట్టె పెట్టాలి. మొదటి ఆటలో అనురుద్ధుడు ఓడిపోయాడు. వాడు తన తల్లికి కబురుచేసి బియ్యపు రొట్టె తెప్పించి గెలిచిన ఇద్దరికీ పెట్టాడు. మళ్లీ ఆడారు, మళ్లీ అనురుద్ధుడు ఓడిపోయాడు. ఈవిధంగా అతను మూడుసార్లు ఓడి తల్లి వద్దనుంచి మూడు రొట్టెలూ తెప్పించాడు. తన కొడుకు నాలుగోసారికూడా ఆటలో ఓడి రొట్టెకోసం కబురు చేసినప్పుడు, తల్లి "ఇక లేదు," అని చెప్పమని నౌకరుతో చెప్పి, ఆ మాట వాడికి అర్థం కాగలందులకు ఒక ఖాళీగిన్నె ఇచ్చి పంపింది.



ఈ గిన్నెలోకి ఎలా వచ్చిందో ఒక రొట్టె వచ్చింది. దాన్ని అందులో ఎవరు పెట్టారో మనకు తెలియదు. నౌకరు ఆ గిన్నెను అనురుద్ధుడికిస్తూ, "ఇక లేదు," అని చెప్పాడు. అనురుద్ధుడు గిన్నె మూత తీసి అందులో ఒక కొత్తరకం రొట్టె ఉండటం గమనించాడు. ప్రపంచజ్ఞానం లేనివాడు కావటంచేత ఆ రొట్టె పేరు "ఇక లేదు" కాబోలు అనుకున్నాడు. తింటే ఆ రొట్టె బియ్యపు రొట్టెలకన్న ఎంతో రుచిగా ఉన్నది.

అనురుద్ధుడు తల్లివద్దకు పోయి, "'ఇక లేదు' రొట్టెలు నాకిదివరకెన్నడూ పెట్టావు కావేమమ్మా!" అని మారాంచేశాడు. తల్లి ఆశ్చర్యపడి జరిగిన విషయం తెలుసుకుని నిర్ఘాంతపోయింది. అనురుద్ధుడికి ప్రపంచ జ్ఞానం లేకపోవటానికి ఇది ఒక ఉదాహరణ. అతను ఇలాగే పెరిగి పెద్దవాడయాడు.

అనురుద్ధుడితోబాటు అతని అనుచరులు కూడా దాదాపు ఈవిధంగానే పెరిగినట్టు కనిపిస్తుంది. అతను పదిహేనేళ్లవాడై ఉండగా అతనూ, భద్రుడూ, కింబిలుడూ చర్చలో పడ్డారు: బియ్యం ఎందులోనుంచి వస్తుంది?

"గిన్నెలోనుంచి వస్తుంది," అన్నాడు కింబిలుడు; వాడి ఉద్దేశం బియ్యాన్ని కడిగే గిన్నె అని.




" కాదు, తప్పేలాలోనుంచి వస్తుంది," అన్నాడు భద్రి. తప్పేలా బియ్యం వండేది.

" కానేకాదు, అది బంగారు పళ్లెంలో నుంచి వస్తుంది!" అన్నాడు అనురుద్ధుడు. వాడు చెప్పిన పళ్లెం అన్నం వడ్డించటానికి ఉపయోగించేది.

అనురుద్ధుడు ఇలా ప్రపంచజ్ఞాన శూన్యుడై ఉన్న స్థితిలో బుద్ధుడు, ప్రతి శాక్యకుటుంబంనుంచీ ఒక్కొక్కణ్ణి తన వద్దకు పంపవలిసిందని కబురు చేశాడు.

అమితోదనుడి కుటుంబంలోనుంచి మహనముడైనా వెళ్లాలి, అనురుద్ధుడైనా వెళ్లాలి. మహనముడికి సన్యాసి కావాలని ఏమాత్రమూ లేదు, రాజరికం అనుభవించాలని ఉన్నది. అదీగాక అనురుద్ధుడులాటి జ్ఞానహీనుడు రాచకార్యాలకు పనికిరాడు. అందుచేత మహనముడు అనురుద్ధుణ్ణి సన్యాసికావటానికి పురికొల్పాడు. " బియ్యం ఎందులోనుంచి వస్తుంది?" అన్న చర్చ అతనికి ఈ అవకాశాన్ని ఇచ్చింది.

మహనముడు అనురుద్ధుడితో, "బియ్యం ఎలా వస్తుందోకూడా నీకు తెలీదా? రైతులు పొలందున్ని పండిస్తారు. వ్యవసాయం చెయ్యటానికి నాగళ్లూ, పలుగులూ, పారలూ, చేటలూ, కొడవళ్లూ మొదలైనవి పద్దెనిమిది రకాల పనిముట్లు కావాలి. పొలాలకి కాలవలు కట్టాలి, గట్లువెయ్యాలి, ఎరువు తోలాలి, నారుమడివెయ్యాలి, నాటాలి, కలుపు తియ్యాలి. పైరును ఎలుకలూ, పందులూ, పశువులూ నాశనం చెయ్యకుండా అహోరాత్రాలు కాపాడాలి. మంచెమీద కూచుని పిట్టలనూ, చిలకలనూ తోలుతూండాలి. ఇది తొమ్మిది మాసాల పని. పంట నూర్చినాక కూలీలకూ, మంగళ్లకూ, చాకళ్లకూ, బిచ్చగాళ్లకూ ఇవ్వగా మిగిలినదానిలోనుంచి పాతబాకీలు తీర్చి, విత్తనాలకు కొంత ఉంచుకుని మిగిలినది తినాలి. దాన్ని మళ్లీ పై పంటదాకా పొదుపుగా వాడుకో



వాలి," అన్నాడు. ఈ మాటలకు ఆశ్చర్య పోతూ, "అబ్బో, బియ్యం రావటానికి ఇంత శ్రమ ఉన్నదా?" అన్నాడు అనురుద్ధుడు.

"ఇంతేనా? అనుకోకుండా కూలీలు జబ్బుపడతారు. తరుణం దాటిపోతే పంట పాడవుతుంది. వ్యవసాయం చేసేవాడికి ఏ విధమైన సుఖమూ లేదనుకో. అందుకే, తమ్ముడూ, నాకీ వ్యవసాయం వద్దు. నేను హాయిగా బుద్ధుడిదగ్గిరికి వెళ్లి సన్యాసం పుచ్చుకుందా మనుకుంటున్నాను!" అన్నాడు మహనముడు.

"అన్నా, నీకు కనీసం ఈ వ్యవసాయం గొడవ తెలియనన్నా తెలుసు. నాకు బొత్తిగా ఏమీ తెలియదు. నన్ను బుద్ధుడి దగ్గిరికి వెళ్లనీ. నువు చక్కగా పొలాలు చూసుకో!" అని ప్రాథేయపడ్డాడు అనురుద్ధుడు. అదే మహనముడికి కావలిసిందికూడా.

తన అన్నతో మాట్లాడిన తరవాత అనురుద్ధుడు తన తల్లివద్దకుపోయి, "అమ్మా, నేను బుద్ధుడిదగ్గిరికి వెళ్లిపోతాను. అనుమతి ఇయ్యి!" అని అడిగాడు.

"మీ నాయన పోయాడు. ఇప్పుడు నాకు నువ్వూ, మీ అన్నా రెండు కళ్లవంటివాళ్లు. మీలో ఎవరు వెళ్లిపోయినా, గుడ్డివాన్నయి పోతాను!" అన్నది తల్లి.




కాని అనురుద్ధుడు ఆమెను మళ్లీమళ్లీ అనుమతి అడిగాడు. అనుమతి పూర్తిగా నిరాకరిస్తే తన కొడుకు మనసు క్షోభించి పోతుందనుకుని తల్లి, "నాయనా, నువ్వెంతగా అడుగుతుంటే నేనుమాత్రం ఏంచెయ్యగలను? భద్రి బుద్ధుడి శిష్యుడు అయే పక్షంలో నువుకూడా వెళ్లు," అన్నది.

భద్రి అప్పటికే రాజరికంలో ప్రవేశించి రాచకార్యాలు నిర్వహిస్తున్నాడు; అలాటి వాడు ఎన్నటికీ సన్యాసం పుచ్చుకోడని అనురుద్ధుడి తల్లి ఉద్దేశం.

అనురుద్ధుడు ఉపాయంచేత భద్రిని సన్యాసానికి ఒప్పించాలని నిశ్చయించాడు.



శాక్యులు ఆడితప్పరు. అందుచేత భద్రిచేత ఏదోవిధంగా సన్యాసానికి ఒప్పిస్తే తరవాత అతను ప్రాణమైనా విడుస్తాడుగాని అన్న మాట తప్పడు.

అనురుద్ధుడు భద్రివద్దకు వెళ్లి అతన్ని ఆలింగనం చేసుకుని, "నేను నిన్ను ఇంతగా ప్రేమిస్తున్నాను గదా, నేను ఎప్పటికైనా సన్యాసం పుచ్చుకుంటే నాకు తోడుగా ఉండటానికి నువుకూడా సన్యాసం పుచ్చుకుంటావా?" అన్నాడు.

అప్పటికే అనురుద్ధుడు సన్యసించ నిశ్చయించాడని భద్రి కలలోకూడా ఊహించలేదు. అతను నిర్లక్ష్యంగా, "నువు పుచ్చుకున్న మరుక్షణం నేనుకూడా సన్యాసం పుచ్చుకుంటాను!" అన్నాడు.

అనురుద్ధుడు ఆనందంతో పొంగిపోతూ, "నేనివాళే సన్యాసం పుచ్చుకోబోతున్నాను. నువుకూడా బయలుదేరి నావెంట రా!" అన్నాడు. భద్రి నిర్ఘాంతపోయాడు.

"ఒరే, మనం ఇంకా కుర్రవాళ్లం. అనుభవించవలిసిన సుఖాలు చాలా ఉన్నాయి. సన్యాసానికేం తొందర? ముసలివాళ్లమయాక అలాగే సన్యాసం పుచ్చుకుందాంలే!" అన్నాడతను.

"ముసలితనం తరవాతనే చావు వస్తుందని ఎక్కడైనా ఉందా ఏమిటి? అందరూ ముసలివాళ్లయే చస్తున్నారా? సన్యాసాన్ని ముసలితనంతో ముడిపెట్టటం వివేకంకాదు. సిద్ధార్థుడు ఇరవైతొమ్మిదో ఏటనే సన్యసించాడు. ఎందరో క్షత్రియులు యౌవనంలోనే సన్యాసం పుచ్చుకున్నారు. అందుచేత నావెంట వచ్చెయ్యి," అన్నాడు అనురుద్ధుడు.

"అయితే నాకు ఏడేళ్లు గడువియ్యి, తరవాత మనం సన్యాసం పుచ్చుకుందాం!" అన్నాడు భద్రి. కాని అనురుద్ధుడు ఒప్పుకోలేదు. భద్రి గిల్లిగిల్లి బేరం చెయ్యగా అతను ఏడు రోజులు వ్యవధి మాత్రం ఇవ్వటానికి ఒప్పుకున్నాడు. —(ఇంకా వుంది)





# మణిమాణిక్యాలు

రత్నాలు అనాదిగా మనుషులకు ఆనందాన్ని చేకూర్చుతున్నాయి. ఇందుకు చాలా కారణా లున్నాయి. అవి అరుదైనవి, నిపుణులు సానబట్టి నప్పుడు ఎంతో అందంగా రంగుల కాంతులను వెదజల్లుతాయి, అవి చాలా విలువ గలవి. ఒకటి రెండు మంచి రత్నాలను సంపాదించి పరమ దరిద్రుడు ఇట్టె సంపన్నుడైపోవచ్చు. రత్నాలు అందుచేతనే సంపదకు చిహ్నం. అవి రాజుల కిరీటాలనూ, రాణుల ఆభరణాలనూ అలంక రిస్తాయి. రత్న రాసులు అపారమైన సంపదను సూచిస్తాయి.

రత్నా లన్నిటికీ రాజు వజ్రం. సృష్టిలో ఇంత కంటె గట్టిపదార్థం లేదు. కాని ఇందులో ఉన్నది కేవలం బొగ్గే. బొగ్గుకూ, పెనసలుముక్కలో వుండే పదార్థానికీ, వజ్రంలో వుండే పదార్థానికి రసాయన రీత్యా తేడా లేదు. ఆ పదార్థమే స్ఫటికాకారంలో వజ్ర మనిపించుకుని, ఎంతో ఖరీదు సంపాదించి, రాజుల కిరీటాలనూ, ఉంగరాలనూ, ధనికులైన స్త్రీల చెవి కమ్మలనూ అలంకరిస్తున్నది.

ముడివజ్రాలు గాజురాళ్లలాగే వుండి కళా హీనంగా వుంటాయి. వాటిని నిపుణులైనవారు సాన పట్టినప్పుడే వాటికి అందమూ, కాంతీ, ఆకర్షణా వస్తాయి. చరిత్రయుగంలో దొరికిన పెద్ద వజ్రం కులినాన్ వజ్రం. దీని బరువు 3106 కారట్లు. (ఒక కారట్ సుమారుగా తులంలో 60 వ వంతు వుంటుంది.) ఈ ముడివజ్రాన్ని బ్రిటిషు రాజయిన ఏడవ ఎడ్వర్డుకు చూపించగా ఆయన, "దీన్ని రోడ్డు మీద చూసినట్టయితే గాజుసుద్ద అనుకుని పక్కకు తన్నేసేవాణ్ణి!" అన్నాడట.

ఒకప్పుడు ప్రపంచఖ్యాతి సంపాదించిన వజ్రాలు మన దేశానికి చెందినవే—"గ్రాండ్ మొగల్," "కోహినూర్," "మూన్ ఆఫ్ ది మౌంటెన్స్,"

మొదలైనవి. ప్రపంచంలో ఇతర ప్రాంతాల వజ్రాల గనులు కనిపెట్టటానికి రకరకాల సంఘటనలు సహాయపడ్డాయి. రెండు ఉదాహరణలుమాత్రం తీసుకుందాం. 1727లో ఒక మత ప్రచారకుడు బ్రెజిలులో బంగారంకోసం కడిగే మట్టిలో ముడి వజ్రాలు చూసి వాటిని పోల్చగలిగాడు. ఏమంటే ఆయన అంతకుపూర్వం మన ఇండియాలో వుండి ముడివజ్రాలను చూసి వున్నాడు. ఈ సంఘటన ఫలితంగా అక్కడ ఒక బ్రహ్మాండమైన రత్న పరిశ్రమ ప్రారంభమై ఇప్పటికీ నడుస్తున్నది.

అలాగే దక్షిణాఫ్రికాలో కింబర్లీ అనేచోట 1886 లో బోయెర్ జాతికి చెందిన ఒక రైతు కుర్రవాడికి ఒక మెరిసే "గులకరాయి"లాటిది దొరికింది. దాని ఫలితంగా అక్కడ వజ్రపు గనులున్నట్టు బయటపడింది. ఈనాడు ప్రపంచంలోని ఇతర ప్రాంతా లన్నిటికన్న బెల్జియన్ కాంగోలో ఎక్కువ వజ్రాలు తవ్వుతున్నారు. ఏటా దాదాపు మూడు టన్నుల వజ్రాలు ప్రపంచమంతటా తవ్వబడుతున్నాయి. అయితే వీటిలో నూరింట రెండు వంతులు మాత్రమే సానబట్టి ఆభరణాలలో పొదగటానికి వీలయినవి. మిగిలినవి పరిశ్రమలలో అతిగట్టి మొనలూ, అంచులూ కావలసిన యాంత్రిక పరికరాలకు వాడతారు. సాన బట్టిన రాళ్లలోకూడా దోషరహితమైన వజ్రాలు చాలా కొద్ది.

వజ్రాలలో మేలిరకం వజ్రాలకు రంగు ఉండదు. రంగు లేని వజ్రాలకే ధర జాస్తి. అయితే వజ్రాలలో అందమైన రంగులు కలవి కూడా ఉన్నాయి. వాటిలో కొన్ని చరిత్ర ప్రసిద్ధి గలవి.

1638 లో ఒక ఫ్రెంచి భూగోళ శాస్త్రవేత్త ఇండియాకు వచ్చి కొన్ని మణులు కొనుక్కు పోయాడు. ఆయన 1668 లో ఫ్రెంచిరాజైన పధ్నాలుగో లూయీకి ఒక పెద్ద నీలి వజ్రమూ, ఇరవైనాలుగు

కింబర్లీ రత్నాల గనులు



చిల్లర వజ్రాలూ అమ్మాడు. ఆ నీలివజ్రాన్ని మరొకసారి సానబట్టి రాజవంశపు రత్నాలలో చేర్చారు. 1792 లో ఈ రత్నాలను ఎవరో అపహరించారు. మిగిలినవన్నీ దొరికాయిగాని నీలివజ్రం దొరకలేదు. అది కాలక్రమాన హోప్ అనే ఆయన వద్దకు చేరింది. అప్పటికి దాని ప్రమాణం చాలా తరిగిపోయింది. ఇప్పుడు ఈ హోప్ వజ్రం బరువు 44 న్నర కారట్లు.

హోప్‌వజ్రం కంటెకూడా అందమైనదీ, విలవైనదీ డ్రెస్డెన్ వజ్రం. ఇది ఆకుపచ్చరంగు గలది. టిఫానీ వజ్రం మరొక ప్రసిద్ధ వజ్రం. దీని రంగు నారింజపండు రంగు. ఇప్పటి ఎలిజబెత్ రాణికి ఒక గులాబీరంగు వజ్రాన్ని బహుమతిగా ఇచ్చారు.

కోహినూర్ వజ్రం జగత్ప్రసిద్ధమైనది. ఇది 5000 ఏళ్లక్రితం గోదావరీనదిలో దొరికిందట. ఇది ఒకప్పుడు విక్రమాదిత్యుడి వద్ద ఉండేదనీ, కాలక్రమాన సుల్తాను అల్లాఉద్దీను వద్దకు చేరిందనీ, దీని ఖరీదు ప్రపంచమంతటా రోజూ అయే ఖర్చులో నగం ఉంటుందని నిపుణులు వెల కట్టారనీ, బాబరు 1526 లో రాశాడు. 1739 వరకు ఇది మన దేశాన్ని ఏలిన మొగలాయీ చక్రవర్తుల అధీనంలో ఉన్నది. ఆ యేడు నాదిర్‌షా దండెత్తివచ్చి మొగలాయీలను జయించి ఢిల్లీని కొల్లగొట్టాడు. అనేక రత్నాలు దొరికాయి గాని ఈ వజ్రంమాత్రం దొరకలేదు. దానిని ఓడిపోయిన మహమ్మద్ షా తన తలపాగాలో దాచినట్టు నాదిర్ షా పసికట్టి, "మనం తలపాగాలు మార్చుకుందాం!" అన్నాడు. అది సంధిసఖ్యతకు సంప్రదాయ చిహ్నం కావటం వల్ల మహమ్మద్ షా ఒప్పుకోక తప్పిందికాదు. ఆ విధంగా ఈ వజ్రం నాదిర్ షా చేతిలో పడింది. దాన్ని రహస్యంగా తలగుడ్డనుంచి పైకి తీసి చూసు

ముడివజ్రము, సానబట్టిన వజ్రము



కుంటూనే నాదిర్ షా పరమానందంతో "కోహి నూర్!" అని కేకపెట్టాడు. అంటే "కాంతుల పుట్ట" అని అర్థం. ఆనాటినుంచీ ఆ వజ్రానికి ఆ పేరే రూఢి అయింది.

తరవాత ఈ వజ్రం చాలా చేతులు మారింది. చిట్టచివరకు ఇది ఈస్టిండియా కంపెనీవారి వశం కాగా, వారు దానిని బ్రిటిషు రాణి విక్టోరియాకు కానుకగా ఇచ్చారు. ఇప్పటికీ అది బ్రిటిషు రాజ వంశీయుల అధీనంలోనే ఉన్నది.

కెంపులూ, ఇంద్ర నీలాలూ ఒకే జాతికి చెందిన ఖనిజాలు. స్ఫటికాలు ఎర్రగా ఉంటే కెంపు లంటారు; రంగు లేకుండాగాని, గులాబీ, పసుపు, ఆకుపచ్చ, ఊదారంగులలోగాని ఉంటే ఇంద్రనీలా లంటారు.

ఈ రత్నాలను ఒక వైపు తిప్పిచూస్తే ఒక రంగూ, ఇంకో వైపునుంచి చూస్తే ఇంకొక రంగూ కనిపిస్తుంది. అందుచేత సాన బట్టేటప్పుడు ఈ తేడాలు గమనించి సానబట్టాలి. ఒక్కొక్కసారి కెంపులలోనూ, ఇంద్రనీలాలలోనూ ఆరు కోణాల ఆకారంలో కాంతికిరణాలు వెలువడేటట్టు ఆ స్ఫటికాలు ఏర్పడటం జరుగుతుంది. ఆ భాగాలను సానబట్టేవారు వేరుచేసినప్పుడు వాటిని "నక్షత్రాలు" అంటారు. ఈవిధంగా కెంపు నక్షత్రాలూ, ఇంద్రనీల నక్షత్రాలూ వస్తాయి. ఇవి చూడటానికి చాలా అందంగా ఉంటాయి. 12 కిరణాలతో గూడిన అపూర్వమైన కెంపు నక్షత్రం ఒకటి కొంత కాలంక్రితం అమెరికాలో ప్రదర్శించబడిందట.

సాధారణంగా 10 కారట్ల బరువు గల కెంపు పెద్ద కెంపుకింద లెక్క. 25 కారట్లు మించిన బరువుగల కెంపులు చాలా అరుదు. ఇంద్రనీలాలు అలా కాదు. 100 కారట్ల పైబడినవి చాలా దొరికాయి. సింహళంలో ఒకటి, రెండు పౌనుల బరువు తూగే

కెంపునక్షత్రము, ఇంద్రనీలనక్షత్రము



ఇంద్రనీలాలుకూడా దొరికాయట. కెంపులూ, ఇంద్రనీలాలూ ఒకప్పుడు బర్మానుంచే వచ్చేవి. అయితే బర్మాలో మంచి ఇంద్రనీలాలకన్న మేలైన కెంపులు హెచ్చుగా దొరుకుతాయి. తాయిలాండులో మంచి కెంపులకంటె మంచి ఇంద్రనీలాలు హెచ్చుగా దొరుకుతాయి. సింహళంలో మంచి ఇంద్రనీలాలూ, ఇంద్రనీల నక్షత్రాలూ దొరుకుతాయి.

కెంపులుగా ఎంతోకాలం చలామణీ అయినవి కొన్ని నిజమైన కెంపులు కావు—ఇతర ఖనిజాలు. ఈ "మాయ"కెంపులలో ప్రసిద్ధమైనవి చాలా ఉన్నాయి. వీటిలో రెండు బ్రిటిషు రాజకిరీటంలోనూ, రాజవంశ రత్నాలలోనూ ఉన్నాయి. వాటిలో ఒకటి, 352 కారట్ల బరువు గలది, రణజిత్ సింగ్, జహంగీర్, షాజహాన్, ఔరంగ్‌జేబ్, మహమ్మద్‌షాల వద్ద ఉండినది.

ఇంద్రనీలాలలో చాలా పెద్దవి ఉన్నాయి. బర్మా రాజులవద్ద 951 కారట్ల బరువు గల ఇంద్రనీలమూ, రష్యారాజులవద్ద 260 కారట్ల బరువుగల ఇంద్రనీలమూ ఉండేవి. ప్రపంచఖ్యాతి గల ఇంద్రనీల నక్షత్రాలలో "స్టార్ ఆఫ్ ఇండియా" అనేది 563 కారట్ల బరువు గలది ; కెంపు నక్షత్రాలలో ప్రసిద్ధమైనది "డి లాంగ్," 100 కారట్ల బరువు గలది. ఈ రెండూ ఇప్పుడు అమెరికాలో ఉన్నాయి.

కెంపులూ, ఇంద్రనీలాలూ గులకరాయిలో దొరుకుతాయి. కాని గనులలోనుంచి తవ్విన పదార్థంనుంచి పనికివచ్చే రాళ్లను వేరుచెయ్యటానికి చాలా నెలలు పరిశ్రమ చెయ్యాలి.

ప్రకృతిలో రత్నాలతోబాటు నకలు రత్నాలు కూడా ఉన్నాయి. రత్నాలు కొనలేనివారు నకలు రత్నాలతో తృప్తిపడతారు. కాని ఇప్పుడిప్పుడు శాస్త్రవేత్తలు అనేక రత్నాలను కృత్రిమంగా తయారు




బ్రిటిషు రాజకిరీటంలోని కెంపు
మాయకెంపు

చేస్తున్నారు. ఇలా కృత్రిమంగా తయారయేవాటిలో కెంపులూ, ఇంద్రనీలాలూ కూడా ఉన్నాయి. ఇవి మూడు మూర్తులా అసలు రత్నాలనే పోలి ఉంటాయి; పరీక్షిస్తే వాటిలో లోపాలు తెలుస్తాయి; కాని ఇవి చాలా చౌకగా లభిస్తాయి, చూడటానికి అసలు రత్నాలంత అందంగానూ ఉంటాయి. వింత ఏమిటంటే కెంపు నక్షత్రాలనూ, ఇంద్రనీల నక్షత్రాలనూకూడా ఇప్పుడు కృత్రిమంగా ఉత్పత్తి చేయ గలుగుతున్నారు.

పచ్చలు, గరుడ పచ్చలు, మరకతాలు అనే జాతికి చెందిన రత్నాలలో ప్రసిద్ధమైనవి మరకతాలు. ఇవి కాంతివంతమైన ఆకుపచ్చరంగు కలిగి ఉంటాయి. వీటిలోఉండే ఖనిజం బెరిలియం రసాయనం. అందులో క్రోమియం చేరినప్పుడు ఈ ఆకుపచ్చ రంగు ఏర్పడుతుంది. లేనిపక్షంలో వీటి రంగు నీలం-ఆకుపచ్చ (సముద్రపు రంగు.) వీటిలో గులాబీ రంగు, పసుపుపచ్చ రంగు కలవి కూడా ఉన్నాయి. యురేనియం చేరిన రత్నాలు కూడా ఈ జాతిలో ఉన్నాయి, వాటిని "హెలియోడార్" లంటారు.

ఒకప్పుడు మరకతాలు ఈజిప్టులోని ఎర్ర సముద్రతీరంనుంచి వచ్చేవి. అమెరికా ఖండాన్ని తెల్లవాళ్లు వశపరచుకునేనాటికి అక్కడి ఎర్ర ఇండియనులు మరకతాలను బాగా ఎరుగుదురు. స్పానిష్‌వారు అక్కడి మరకతపు గనులను కనుక్కొని అక్కడినుంచి మణులను తవ్వి స్పెయినుకు పంపనారంభించారు. అక్కడినుంచి ఇవి ఇండియాకు కూడా వచ్చాయి.

కొలంబియానుంచి చాలా పెద్ద మరకతాలు వచ్చాయి. వీటిలో ఒకదానిని మలిచి లేపనాలుంచే జాడీ ఒకటి తయారుచేశారు. ఒకే అరుపలకల స్ఫటికంనుంచి తయారుచేసిన ఈ జాడీ బరువు

మరకతంలో మలిచిన పాత్ర



2,680 కారట్లు— దాదాపు ఒకటిన్నర పౌనులు! ఇలాగే మరకత స్ఫటికాన్ని మలిచి తయారు చేసిన పానపాత్ర జహంగీరువద్ద ఉండేది. ఆయన భార్య అయిన నూర్జహాఁ, ఒకనాడు తన భర్తా, మరి కొందరూ కూచుని బంగారు పాత్రలతో సారాయి తాగుతూ ఉండటం చూసిందట. "మిగిలిన వారిలాగే నీవుకూడా బంగారు పాత్రలతో తాగటమేమిటి?" అని ఆమె భర్తను కోప్పడి ఆయనకు పానపాత్రగా మరకత పాత్ర బహూకరించిందట. మొదట జహంగీరు సంతోషించాడు, కాని తరవాత తన పాత్రలో ఎక్కువ సారా పట్టటం లేదని తెలుసుకున్నాడు. కాని దానినుంచి తప్ప, తాగనని భార్యకు మాట ఇచ్చిఉండటంవల్ల ఏమీ చెయ్యలేకపోయాడు.

జహంగీరు వాడిన ఈ మరకతపాత్ర ఇప్పుడు అమెరికాలో ఉన్నది.

ఆకుపచ్చరంగు లేని పచ్చలు, సముద్రపురంగు గలవి, కళంకరహితంగానూ, పెద్దవిగానూ ఉంటే మంచి వెల సంపాదిస్తాయి. వాటి స్ఫటికాలు పెద్దవి లభిస్తాయికూడా. 1910 లో బ్రెజిల్‌లో 220 పౌనుల బరువు కల కళంకరహితమైన స్ఫటికం దొరికింది. ఇంతకన్న పెద్ద రత్నం ఎన్నడూ ఎవరికీ దొరికిఉండదు. దీనిని జర్మనీకి పంపి కోయించి, దీనినుంచి 2 లక్షల కారట్ల బరువు గల పచ్చలు, ఎంతో నాణ్యమైనవి, తయారు చేయించారు. ఆకుపచ్చ, నీలం రంగులు కలిసిన పచ్చలను జాగ్రత్తగా వేడెక్కించినట్టయితే అవి అందమైన నీలం రంగుకు మారుతాయని కనిపెట్టారు.

ముత్యాలనూ, పగడాలనూ మనం నవరత్నాలలో చేర్చుతాం. మిగిలిన రత్నాలలాగా ఇవి ఖనిజాలు కావు. పాశ్చాత్యులు పగడాలను రత్నాలలో చేర్చరు గాని, ముత్యాలను చేర్చుతారు. కొన్ని

మేలి ముత్యాలు ముత్యపు చిప్పనుంచి వస్తాయి





సముద్ర జంతువుల శరీరాలలోకి ఇతర జీవులు ప్రవేశించినప్పుడు వాటి చుట్టూ ఒక విధమైన పదార్థం పేరటంవల్ల ముత్యాలు ఏర్పడతాయి. ఈ విధంగా సీపులూ, కాకి చిప్పలూ, శంఖాలూ మొదలైన అనేక జంతువులలో ముత్యాలు దొరుకుతాయి. హిందూ మహాసముద్రంలో ఉండే రాక్షసి కాకిచిప్పలలో గుమ్మడికాయలంతేసి ముత్యాలు కూడా దొరుకుతాయి. కాని ఈ ముత్యాలన్నిటికీ విలవ లేదు. అసలైన ముత్యపు చిప్పలలో దొరికేవే విలవైన ముత్యాలు. ముత్యపుచిప్పకూడా ముత్యంలాగే నిగనిగలాడుతూ, కాంతులు వెదజల్లుతుంది. ఏ జంతువులో తయారైన ముత్యాలైనా ఆ జంతువుపైన ఉండే డిప్ప తాలూకు పదార్థంతోనే తయారవుతాయి.

మంచి ముత్యాల నిచ్చే సముద్రపు జంతువులు హిందూ మహాసముద్రంలోనూ, పెసిఫిక్ మహాసముద్రంలోనూ ఉన్నాయి. అమెరికాలో ఉండే నదులలోకూడా మంచిరకం ముత్యాల నిచ్చే మరొక జాతి జంతువులున్నాయట.

1920 నుంచీ జపానువాళ్లు పనిపెట్టుకుని ముత్యాలు "పండిస్తున్నారు." 1940 నాటికి వారు ఏడాదికి కోటి ముత్యాలు ఉత్పత్తిచేసే స్థితికి వచ్చారు. "పంట" ముత్యాలే ఖరీదు, అసలు ముత్యాల సంగతి వేరే చెప్పనవసరం లేదు.

మనలో కొందరు ఉంగరాలలో "ఓపల్" రాళ్లు వేసుకుంటారు. ఓపల్ స్ఫటికాకారంలో ఉండదు, అది శిలలలో చేరినది. కాని దానినుంచి అనేకరంగుల కిరణాలు ప్రసరించటంవల్ల చూడటానికి చాలా అందంగా ఉంటుంది. హంగరీలో దొరికే ఓపల్ రాళ్లు తెల్లగా ఉండి, ఎరుపు, నీలం, ఆకుపచ్చ రంగులను వెదజల్లుతాయి. ఆస్ట్రేలియాలోని న్యూ సౌత్ వేల్స్‌లో దొరికేవి మసిరంగు

ప్రపంచంలో కెల్లా పెద్ద ముడిరత్నం (220 పౌనులు)





లోనూ, నల్లని నలుపురంగులోనూ ఉంటాయి. వాటిని కొంచెం అటూ ఇటూ కదిలించినట్టయితే వాటిలో రంగుల కిరణాలు నృత్యం చేస్తున్నట్టుగా ఉంటుంది.

ఆస్ట్రేలియాలో దొరికే ఓపల్ రాళ్లలో మరొక విశేషమేమంటే ఇక్కడ నశించిన పురాతన జంతువులపై ఓపల్ శిల పేరుకున్నది. మెక్సికోలో తేనె రంగు ఓపల్ దొరుకుతుంది. ఇది కొంతవరకు కిరణభేద్యంగా ఉంటుంది. రాయిలోపల రంగుల చారలు కనిపిస్తాయి. అమెరికాలోని నెవాడా రాష్ట్రంలో శిలీభూతమైన ప్రాచీన అరణ్యాలలో ఓపల్ దొరుకుతుంది.

"అల్యూమినం ఫ్లూవోసిలికేట్" అనే ఖనిజం పుష్యరాగంలో ఉంటుంది. కాని చవుకబారు శిలాస్ఫటికాలను, పసుపుపచ్చగా ఉండేవాటిని సాధారణంగా పుష్యరాగాలకింద విక్రయిస్తూ ఉంటారు. పుష్యరాగం మామూలుగా పసుపుపచ్చరంగులో ఉంటుంది. అయితే రంగులేని పుష్యరాగాలూ, నీలంరంగు పుష్యరాగాలూ ఇంకా విరివిగా దొరుకుతాయి. గులాబీరంగు గల పుష్యరాగాలు చాలా అరుదు: అయితే వేడెక్కించటంవల్ల పుష్యరాగాలకు ఈ రంగు వస్తుంది.

తేలిక నీలంరంగు గల పుష్యరాగాలను ఇంద్రనీలాలకింద అమ్మేస్తూ ఉంటారు. ఇవి ఇంద్రనీలాలు దొరికే గనులలోనే దొరుకుతాయి.

పుష్యరాగం ధరించినవారికి ఆగ్రహం రాదనీ, అది వేడినీటిని చల్లబరుస్తుందనీ, పిచ్చినీ, ఉబ్బసాన్నీ, నిద్రలేమినీ నివారిస్తుందనీ, శరీరబలాన్నీ, జీర్ణశక్తినీ పెంపొందిస్తుందనీ, ఆకస్మిక మరణాల నుంచి రక్షిస్తుందనీ ప్రాచీనులు భావించేవారు.

క్రిసోబెరిల్ అనే మరొక ఖనిజంనుంచి వైడూర్యాలు అనే విలువగల రత్నాలు లభిస్తున్నాయి.

ముడిరత్నాలను పలకలు చెక్కటం నిపుణుల పని



వీటిలో రెండు రకాలు ప్రసిద్ధమైనవి. ఒకదాని పేరు "పిల్లికన్ను," రెండవది "అలెగ్జాండ్రైట్". "పిల్లికన్ను" పేరుకు తగినట్లే ఉంటుంది. దీని రంగు తేనెరంగుగా గాని, పసుపు ఆకుపచ్చల మిశ్రమంగా గాని ఉంటుంది. "అలెగ్జాండ్రైట్" పగటివేళ చూస్తే ఆకుపచ్చగానూ, దీపపు కాంతిలో ఎర్రగానూ కనబడుతుంది.

"జేడ్" అనేది రాయి. ఇది చాలా గట్టిగా ఉండి, నునుపు చెయ్యటానికి వీలుగా ఉంటుంది. రసాయనికంగా రెండు రకాల రాళ్లకు ఈ పేరు అమలులో ఉన్నది. ఈ రాయి చైనాలోనూ, మధ్య అమెరికాలోనూ అనాదిగా మనుషులచేత ఉపయోగించబడుతూ వస్తున్నది.

మరకతం రంగులో ఉండే "జేడ్" ప్రశస్తమైనది. ఇది చాలా విలవైనది. జేడ్ పూసలతో తయారుచేసిన తావళాలు 4, 5 లక్షల రూపాయల వెలకు అమ్ముడయాయి! కిందటి శతాబ్దంనుంచీ జేడ్ ప్రధానంగా తవ్వబడుతున్నది ఎగువ బర్మాలో మాత్రమే.

ఇంకా అనేక రకాలైన ఖనిజాలు చవుక రత్నాలుగా చలామణీ అవుతున్నాయి, వాటిలో కొన్ని వజ్రంకంటెకూడా కాంతివంతంగా ఉంటాయి, కాని వజ్రమంత గట్టిగా ఉండవు. ఇతర దేశాలలో అంబరు లేక "తృణమణి"కూడా ఒక రత్నంగా చలామణీ అవుతున్నది. ఇది ఖనిజం గాదు— పురాతన వృక్షాలనుంచి వెలువడి భూగర్భంలో హెచ్చు ఒరిపిడికి గురి అయిన బంక.

ఈ అంబరు తేనెరంగు గలిగి, కిరణభేద్యంగా ఉంటుంది. దీనిని వివిధ వస్తువుల రూపంలో మన ఇష్టం వచ్చినట్టు మలచవచ్చు.

*జేడ్‌తో తయారుచేసిన వస్తువులు*





# వినోదాలు

SANKAR

ఒక వృద్ధుడు తన మిత్రుడితో తన కాలు సలపటం గురించి చెప్పాడు.

"మరేమీలేదు. వయసుతోబాటు ఇటువంటి బాధలు వస్తాయి," అన్నాడు మిత్రుడు.

"అదేంమాట? నా రెండోకాలుకూడా అంతే వయసు గలది. మరి అది సలపదేం?" అన్నాడు వృద్ధుడు.

* * *

కొత్తగా ఒక చిత్రాన్ని పూర్తిచేసిన హాలీవుడ్ నిర్మాత, "నా చిత్రానికి ఒక్క సెంటు రాకపోయినా ఫరవాలేదు. దీన్ని అమెరికాలో ప్రతి ఒక్కరూ చూడటమే నాకు కావాలి!" అన్నాడట.

* * *

ప్రసిద్ధ అమెరికను హాస్య రచయిత మార్క్ట్వేన్ చిన్నతనంలో మిసోరీ రాష్ట్రంలోని ఒక పత్రికలో పనిచేసేవాడు. ఒకనాడు ఆ పత్రిక కొనే ఒక పెద్దమనిషి, "ఇవాళ మీ పత్రికలో నాకొక సాలీడు కనిపించింది. ఇది ఎలాటి శకునం అనుకోవాలి?" అని రాశాడు. మార్క్ట్వేన్ ఆ పెద్దమనిషికి సమాధానం రాస్తూ, "ఇందులో శకునం ఏమీ లేదు. ఆ సాలీడు మా పత్రికలో తమ సరుకులను ఎడ్వర్టయిజు చెయ్యని వ్యాపారస్తు లెవరా అని చూస్తున్నది. అలాటివారి దుకాణాలకు వెళ్ళి నిశ్చింతగా గూడు అల్లుకుందామని దాని వుద్దేశం!" అన్నాడు.

* * *

పత్రికలు వార్తలివ్వటంలో పోటీ చేస్తాయి. ఇతర పత్రికలు ఇవ్వలేని వార్తలను పాఠకులకు అందించినప్పుడల్లా అవి గర్వాన్ని ప్రకటిస్తాయి. ఒక పత్రిక ఒకనాడు ఇలా చెప్పుకున్నది:

"ఫలాని గ్రామంలో ఈ మధ్య 200 ఇళ్ళు దగ్ధమైనట్టు నిన్నటిరోజున వార్త ప్రకటించినది ఈ పత్రిక ఒకటే. ఈ వార్త పూర్తిగా నిరాధారమైనదని ఇతర పత్రికలకంటే ముందుగా నేడు ప్రకటించ గలిగినందుకు మేమెంతో గర్విస్తున్నాము."




1. చె. వె. సీతారామస్వామి, న్యూఢిల్లీ

"చందమామ" ఏయే భాషలలో వెలువడుచున్నది? ఏ భాషలో ఎక్కువ అమ్ముడగుచున్నది?

"చందమామ" ఇప్పుడు తెలుగు, తమిళం, కన్నడం, హిందీ, మరాఠీ, గుజరాతీ భాషలలో వెలువడుతున్నది. ఎక్కువగా అమ్ముతున్నది "హిందీ" "చందమామ".

2. యేచూరి చలపతిరావు, కాకినాడ

దాసు, వాసూల చిత్రకథ "చందమామ" కొక ఆకర్షణ. ఇవి ఇప్పటి వరకు ఎన్నికథలు ప్రచురించేరు? అవి పుస్తకరూపంలో వెలువరిస్తే బాగుండు నంటాను. మీరేమంటారు?

మే 1954 సంచికనుంచి "దాసు - వాసు" ల కథలు వెలువడుతున్నాయి. "చందమామ" తరఫున పుస్తకాలు ప్రచురించటానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. అప్పుడు మిగిలిన వాటితోబాటు ఇవికూడా పుస్తకరూపంలో రావచ్చు.

3. కొట్టె లక్ష్మిపతి, తిరుపతి

మామా, ప్రతినెలా 31 వ తేదీకి మా చేతికి వచ్చి మమ్ముల నానంద పరిచేవారు, ఈ నెల (సెప్టెంబరు) 5 వ తేదీవరకు రానందులకు కారణం తెలుసుకొనవచ్చునా?

కొన్ని అవాంతరాలవల్ల సెప్టెంబరు సంచిక ఆలస్యమయింది. ఇకనుంచీ అటువంటి ఆలస్యం ఉండదు.

4. ఆ. లక్ష్మణ్, మదరాసు

మీరు ప్రచురిస్తున్న "అహింసాజ్యోతి" లో కల్పితమేమియూ లేదుకదా?

ఉంటే ప్రాచీనుల కల్పన ఉన్నదేమోగాని మా కల్పన ఏమీ లేదు.

5. సయ్యద్ సాలెహ, అమలాపురం

**ఆగస్టు సంచికలో ప్రచురించబడిన 6 వ ప్రశ్న నేను పంపించినదికదా, మరి నాపేరెందుకు వేయలేదు ?**

ఒకేరకం ప్రశ్నను అయిదారుగురు పంపించటం జరుగుతున్నది. ముందు పంపిన వారి పేర సమాధానాలిస్తున్నాం.

6. కుమారి బచ్చు జయలక్ష్మి, పెద్దాపురం

**కథలు, చిత్రలేఖనం, వ్యాసాలు — వీటిలో పిల్లలకు పోటీలు ఏర్పాటు చేయించండి. తప్పకుండ చేస్తారుగదండీ ? చేసేవరకు నేను నెలకి ఒక ఉత్తరం వ్రాస్తానండి. వ్రాయమంటారాండీ ?**

వద్దు. లోగడ "చందమామ" లో ఇటువంటి పోటీలు నడిపాము. కాని మంచి రచనలు వగైరా రాక నిలిపివేయవలసివచ్చింది.

7. పూరి బాలస్వామిగుప్తా, వెలుదండ

**నేను మద్రాసు వస్తే మీ ఆఫీసు దర్శించడానికి వీలుందా ?**

తప్పక. "చందమామ" ను చూడటానికి ఇతర దేశాల ప్రధానులదగ్గిరనుంచీ వస్తున్నప్పుడు, ఆప్తులైన పాఠకులెందుకు రాకూడదూ ?

8. జి. యజ్ఞనారాయణ, సికింద్రాబాదు

**మీ చందమామను పుట్టినప్పటినుండి యీనాటివరకు చదువుతూ పిల్లలే కాక మాలాటివాళ్ళుకూడా యింట్లో అల్లరి మానేశారు. బాల్య, యవ్వన, కౌమార, వార్ధక్య దశల్లో ఏ దశలో వున్నవారైనా అంతా చదివి ఆనందిస్తున్నాం.**

ఇది మాకెంత ఆనందదాయకమైన మాటో ఆలోచించండి!

9 ఎ. వి. రాజయ్య, యెల్లారెడ్డి

**మీరు " వినోదాలు " శీర్షికలో ప్రచురించే వినోదాలు పాఠకులు పంపినవా? లేక సంపాదకునివా ?**

పాఠకులు పంపే వినోదాలుకూడా వేస్తాము. సెప్టెంబరు సంచిక ( 68 పేజీ ) లో ఒక పాఠకుడి " జోక్ " కు కార్టూనుకూడా వేశాం.

10. కుమారి కాజ వేంకటశారద, తెనాలి

**" చందమామ " లో ప్రకటనలకు ఎక్కువ పేజీలు వినియోగిస్తున్నారు.**

పాఠకులు ప్రకటనలకు చిల్లిగవ్వకూడా ఇవ్వటంలేదు. వంద ప్రకటనలున్నా మీ 72 పేజీలు మీకు ఉండితీరుతాయి.

మన జాతీయ పరిశోధనాలయాలు :

# 6. సెంట్రల్ ఫుడ్ టెక్నలాజికల్ ఇన్‌స్టిట్యూట్ - మైసూరు

ఈ సంస్థ మైసూరులోని చెలువాంబా భవనంలో ఏర్పాటయింది. ఇది ఎత్తుభూమిపై ఉండటంచేత ఇక్కడినుంచి మైసూరునగరమంతా కనిపిస్తుంది. ఈ భవనంచుట్టూ విశాలమైన వ్యవసాయక్షేత్రాలూ, తోటలూ ఉన్నాయి.

మన దేశపు గడ్డుసమస్యలలో ఆహారసమస్య అత్యంత ప్రధానమైనది. అందువల్ల ఈ సంస్థ సాగించే కృషికి ప్రాముఖ్యం హెచ్చు. ఆహార పదార్థాలను కాపాడటం, నిలవ ఉంచటం, వాటి ఆహారపు విలువను పెంపొందించటం, కొత్త ఆహారపదార్థాలను సృష్టించటం, పిల్లలకూ, జబ్బుపడి కోలుకొనేవారికీ తగిన బలమైన ఆహారాలను తయారుచేయటం మొదలైనవాటిని గురించి ఇక్కడ పరిశోధనలు జరుగుతున్నాయి. కర్రపెండలంనుంచి నకలుబియ్యమూ, వేరుశనగనుంచి ఒక రకం పాలూ, పెరుగూ, మజ్జిగా ఈ సంస్థవారు తయారుచేశారు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 డిసెంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పదండి ముందుకు

రెండవ ఫోటో : ఆగా రెందుకు ?

పంపినవారు : యు. యస్. మూర్తి, C/o కె. మాధవరావు
నిజామ్ షుగర్ ఫ్యాక్టరీ, షక్కర్‌నగర్ — (ఆంధ్ర ప్రదేశ్)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు బడి వదలగానే ఆడుకునేందుకు సరాసరి తోటలోకి వెళ్ళారు. వాళ్ళు వెంటతెచ్చిన పుస్తకాలూ, బంతీ ఒక చెట్టుకింద పెట్టి, అవతలికి వెళ్ళేసరికి, ఒక కొంటెకుర్రాడు వాటిని దొంగిలించి, ఎత్తయిన ఒక రాళ్లగుట్ట చాటున దాక్కున్నాడు. దాసూ, వాసూలు తిరిగివచ్చి, తమ పుస్తకాలూ, బంతీ లేకపోవటం చూసి, వాటిని ఎత్తుకుపోయినవాడికోసం తోట అంతా గాలించసాగారు. ఈలోపల 'టైగర్' కొంటెకుర్రాడు కూర్చున్న రాళ్లగుట్ట మీద వున్న కాళీ డబ్బాను పడతోసింది. డబ్బా కిందకు జారుతూ చేసిన మోత వింటూనే కొంటెకుర్రాడు తారుకుని తిరిగి చూడకుండా పారిపోయాడు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



# రేపటి రూపం...

నేడు అతనిది అంతా వింతగా, అంతా ఆటగా తోచే అమాయికపు వయస్సు. పుడమి పెద్ద బొమ్మరిల్లు, బ్రతుకనంత బాల కేళి.
మెరపు తీగె మిణుగురు పురుగు, విమానపు హోరు
వింత పిలుపు - తండ్రి పనిముట్లు తనకాట వస్తువులు !
తండ్రి ననుకరించడమే ఒక తమాషా !
కాని, రేపటి రూపం వేరు. బ్రతుకొక ప్రక్రియగా పరిణ మిస్తుంది. ఆట పాటుగా మారుతుంది. తమాషా తాపత్రయ మవుతుంది. నేటి యత్నానికీ, పరిశ్రమకీ ఆశయం అతని రేపటి లోకం - రవంత వంత నశించిన లోకం, మరింత మోదం నిండిన లోకం.

ఈ పరిణామంలో .... నేడూ, నిన్నటివలెనే, మా ఉత్పత్తులు మీ గృహాల శుభ్రతకీ, ఆరోగ్యానికీ, ఆనందానికీ, ఉపకరిస్తాయి. పైగా మా నేటి కృషికి మరొక లక్ష్యం .... రేపు — రేపటి మీ పెరిగే జీవన ప్రమాణాలతో పెరిగే అవసరాలను తృప్తిపరచడం, అందుకై మేము విస్తృత సేవా సౌకర్యాలతో, కొత్త కొత్త ఊహలతో, కొత్త కొత్త ఉత్పత్తులతో తయారుగావుంటాము.

**నేడూ, రేపూ హిందుస్థాన్ లీవర్ గృహములకు సేవ చేయుచున్నది.**

PR.3-50 TL

అన్నిచోట్ల అందరికి అందుబాటులో వుండే మా సాటిలేని




# రాజా

## బనియనులు

రాజా నిట్టింగ్ కంపెని
P. B. No. 24, తిరుపూరు

ఏజంట్లు :

## గొల్లపూడి బ్రదర్సు

సత్యనారాయణపురం :: విజయవాడ-2

**పేరెన్నిక గన్న మా "KKK" రకమును అడగండి.**

---

## సౌందర్య అతిశయం




రాజా స్నో దగ్గర వుంటే, మీరు ఎల్లప్పుడు సౌందర్యాతిశయంతో ప్రకాశిస్తారు. రాజా హెయిర్ ఆయిల్ మరింత కాంతినిచ్చి, చక్కటి దీర్ఘమైన కేశములను విరివిగా పెంపొందిస్తుంది.









Use RAJA KASTURI SOAP for luxury Bath.
RAJA BAR SOAP for easy washing.

  

**MFRS: MANYAM & CO., BANGALORE-3 . . . . . .**

GP

# ఎక్కడ విన్నా న్యూట్రిన్ ప్రశంసే!




**Nutrine**

పిల్లలకు న్యూట్రిన్ "డ్రమ్" అంటే ఎంతో యిష్టం. ఏమంటే, న్యూట్రిన్ కంపెనీవారు అందముగా ప్యాక్ చేయుటలో కొత్త పద్ధతిని అవలంబిస్తున్నారు. అత్యంత రుచికరమైన న్యూట్రిన్ మిఠాయిలు, టాఫీలు ఒక ఆకర్షణీయమైన పెట్టెలో అమర్చబడిన్ని, ఖరీదు హెచ్చింపబడక, మామూలు వెలకే అన్ని చోటులందు లభిస్తున్నవి.



మీ మధురానందమునకు:

ది న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కంపెని,
ప్రైవేట్ లిమిటెడ్.
చిత్తూరు - (ఆంధ్ర ప్రదేశ్)

---




ఒక

రాలే

మీకు వుండడం

గర్వకారణం








# రాలె

SRC 51 TG

# ఇది చదివితే మీరు ఆశ్చర్య పడతారు...



రాజాలకు చాలామంది శత్రువులుండే కాలంలో, వారి స్వప్రాణ రక్షణ గొప్ప సమస్యయివుండెను. చీనా దేశ చక్రవర్తి, ఓ. ఫాంగ్ తన శత్రువులను కని పెట్టుటకు అతి చమత్కారమైన విధానమును ప్రయోగించియుండెను. తన కోటయొక్క సింహద్వారమందు లోపల ప్రవేశించే నిమిత్తం సూదంటురాతితో నిర్మించబడిన వలయాకారపు ద్వార ముండెను. ఆయుధాలను దాచుకొని ఎవరైనా వస్తే వెంటనే పట్టుబడేవాడు. తక్షణం ఆయుధములు బయల్పడేవి. ఈనాడు, కంటికి కనిపించనట్టి దేనినైనా చూపగలిగి కనిపెట్టగలుగునట్లుచేసే ఎక్స్-రేలువంటి తదితర పద్ధతులున్నవి. ఆ విధంగా వ్యాధులు కనుగొనబడుచున్నవి.



ఎక్స్-రేలు, వ్యాధికి సరియైన కారణమేమిటో డాక్టర్లు కనుక్కోగలిగి అందువల్ల ఆ వ్యాధులను గలిగించే క్రిములను వారు పరిశీలింపగలుగునట్లు చేయుచున్నవి. అయితే, క్రిములు ప్రతీచోటా వున్నవి; పనియందైనా లేక ఆటలోనైనా— మన మేమిచేయుచున్ననూ ప్రతీరోజూ మనకు అంటకుండా తప్పించుకోజాలనట్టి మురికిలో అవి దాగియున్నవి. ఈ క్రిములు వ్యాధిని గలిగించును. కాని, మీరు లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానముచేయుటవల్ల మీ ఆరోగ్యమును కాపాడుకోవచ్చును.






అది మురికిలోనున్న క్రిములను కడిగివేయును. లైఫ్‌బాయ్‌తో రోజూ స్నానముచేయండి. అది మీకు ఆరోగ్యవంతమైన హాయిని గలిగించును.

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి.

L/11-50 TL

TIC 653

"సైకిలు కొనుక్కోడానికి సంవత్సరం పాటు మూడు మైళ్లు ఆఫీసుకు రోజు నడిచి కావలసిన డబ్బు ఆదా చేసుకొన్నాను నిజానికి ఉత్తమమైన సైకిలే కొన్నాను - **హెర్క్యులిస్**"

హెర్క్యులిస్‌కు ఎంతైనా త్యాగంచేయవచ్చు ఎందు కంటె—అది నిజానికి సైకిల్‌కంటె ఎక్కువైనది, అది మీ జీవిత భాగస్వామి. దాని అందచందాల వల్ల, సునాయాసంగా వెళ్లేది కావడంవల్ల అది మీరు కొనవలసిన అత్యుత్తమకరమైన సైకిల్.

మీ సైకిల్ మీకు పెట్టుబడి

# హెర్క్యులిస్



మీ డబ్బుకు ఉత్తమమైన ప్రతిఫలం

తయారీ : టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా లిడ్. మద్రాసు

Photo by P. V. Subramanyam



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆగా రెందుకు ?

పంపినవారు :
యు. ఎస్. మూర్తి - షక్కర్‌నగర్

